Hurmate Sood
(Telugu)

# వడ్డీ కీడు

మూలం


సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది

అనువాదం

అబుల్ ఫౌజాన్

M.A. *(Islamic Studies)*, M.A. *(Urdu)*

# ప్రకాశకుల విజ్ఞప్తి

ఈ చిరు పుస్తకం మౌలానా మౌదూది గారు వ్రాసిన విశ్వవిఖ్యాత ఉర్దూ గ్రంథం "సూద్" (వడ్డీ)లోని ఒక అధ్యాయం. తీరిక దొరకని కారణంగా ఉద్గ్రంథాల్ని అధ్యయనం చేసే అవకాశం లభించనివారు తక్కువ సమయంలో ఇస్లాం ప్రతిపాదించే ఆర్థిక వ్యవస్థను అర్థం చేసుకోవడం కోసం మేమీ చిరుపుస్తకాన్ని రూపొందించాము. మౌలికంగా సమస్యను అర్థం చేసుకోవడానికి ఈ కొన్ని పుటలు సరిపోతాయని భావిస్తున్నాము.

ఇక ఈ చర్చను కూలంకషంగా అర్థం చేసుకోదలిచిన వారు అసలు గ్రంథమైన "వడ్డీ"ని అధ్యయనం చేయాల్సిందే. అందులో వడ్డీకి సంబంధించిన అంశంపై సుదీర్ఘంగా చర్చించడమే కాకుండా ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన మూల సూత్రాలను కూడా అత్యంత విస్తారంగా, విపులంగా విశ్లేషించటం జరిగింది.

అందరూ లాభపడాలని, విస్తారంగా ప్రకటన జరగాలని దీన్ని స్వల్పధరకే సమకూరుస్తున్నాము. దీని విస్తృత ప్రాచుర్యం కోసం మిత్రులు మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

**సాదిఖ్ అహ్మద్**
**డైరెక్టర్**

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# వడ్డీ కీడు

## నకారాత్మక దృష్టికోణం

గడచిన అధ్యాయంలో ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థ, దాని ప్రధానాంగాలకు సంబంధించి ఇవ్వబడిన క్లుప్త వివరణలో నాలుగు అంశాలు మౌలిక స్థానాన్ని పొంది ఉన్నాయి:

1. కొన్ని ఆంక్షలు, పరిమితులకు కట్టుబడిన స్వేచ్ఛావిపణి.
2. జకాత్ అనివార్యత (విధియై ఉండడం).
3. వారసత్వ చట్టం.
4. వడ్డీ నిషేధం.

అడ్డూ ఆపూ లేని పెట్టుబడిదారీ వ్యవస్థలోని చెడుగులు, సామ్యవాదం, ఫాసిజంలోని లోపాలు బట్టబయలైన తర్వాత ఈ నాలుగింటిలోని మొదటి దానిలోని సమంజసత్వాన్ని ఇప్పుడు అందరూ సూత్రప్రాయంగానయినా అంగీకరిస్తున్నారు. దీని వివరాలకు సంబంధించి కొన్ని శంకలు, అనుమానాలు వారి మనో మస్తిష్కాల్లో ఇప్పటికీ ఉండి ఉండవచ్చు. అయితే "ఇస్లాం మరియు ఆధునిక ఆర్థిక సిద్ధాంతాలు" ఇంకా "భూమి యాజమాన్యానికి సంబంధించిన సమస్య" అనే మా పుస్తకాలు అధ్యయనం చేసినట్లయితే వారి శంకలు, అనుమానాలు దూరమవడానికి అవి దోహదపడతాయని భావిస్తున్నాము.

జకాత్ ఎందుకు అనివార్యం? అనే విషయం లోకానికిప్పుడు దాదాపుగా అవగతమైపోయింది. సామ్యవాదం, ఫాసిజం మరియు పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం – మూడూ కూడా సోషల్ ఇన్సూరెన్స్‌కు సంబంధించి ఎంతటి విశాల వ్యవస్థను ఆలోచించగలిగాయో అంతకన్నా సువిశాలమైన

సామూహిక వ్యవస్థను జకాత్ సమకూరుస్తుంది. అయితే ఇక్కడ కూడా జకాత్ వ్యవస్థకు సంబంధించిన పూర్తి వివరాలు తెలియకపోవడం వల్ల కొన్ని ఇబ్బందులుండవచ్చు. అంతేకాకుండా ఒక ఆధునిక రాజ్య ఆర్థిక విషయాలలో జకాత్ మరియు ఖుముస్ (ప్రభుత్వ పరం అయిన ప్రజా సంక్షేమ నిధి) ఏ విధంగా అడ్జస్ట్ చేయాలో ప్రజలకింకా అర్థం కాలేదు. ఈ చిక్కుముడులను విప్పడానికి దైవచిత్తమైతే జకాత్‌కు సంబంధించిన ఆదేశాల్ని తెలిపే ఒక చిరుపుస్తకం రూపొందించే ప్రయత్నం చేయడం జరుగుతుంది.

వారసత్వ చట్టానికి సంబంధించినంత వరకు ప్రపంచంలోని వారసత్వ చట్టాలన్నిటినీ కాదని ఇస్లాం ఏదైతే ఒక కొత్త పద్ధతిని ప్రతిపాదించిందో, అందలి పరమార్థాలను చాలామంది తెలుసుకోలేకపోయారు. అందుకే ఇస్లామీయ వారసత్వ చట్టంపై వారు రకరకాల ఆక్షేపణలు తెలిపేవారు.కాని ఇప్పుడు ప్రపంచమంతా కూడా దీనిపై దృష్టి సారించింది. చివరికి రష్యాలాంటి సామ్య వాద దేశం కూడా దాన్నుండి ప్రయోజనం పొందకుండా ఉండలేక పోయింది.[1]

---

*1. సోవియట్ రష్యాలో ఇటీవల రూపొందించిన వారసత్వ చట్టంలో సంతానం, భార్య, భర్త, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కాచెల్లెళ్ళు మరియు పెంపుడు సంతానాన్ని వారసులుగా నిర్ణయించడం జరిగింది. అంతేకాకుండా ఒక మనిషి తన ఆస్తి నుండి అగత్యపరులైన తన దగ్గరి బంధువులకు, ప్రజా సంస్థలకు దానం రూపంలో పంచేయడానికి వీలునామా రాసే అవకాశం కూడా కల్పించబడింది. అయితే (దగ్గరి) బంధువుల హక్కు ప్రథమం. దీంతోపాటుగానే మైనరు సంతానం లేక పేద వారసులను వారసత్వం నుండి వంచించే అవకాశం ఉన్న వీలునామాల్ని నిషేధించడం జరిగింది. ఈ చట్టాన్ని చూసిన వారెవరైనా సరే, సామ్య వాద "ప్రగతిశీలురు" 625లో రూపొందించిన చట్టం వైపు* ***1945లో "తిరోగమించార"ని భావించకుండా ఉండలేకపోతారు.***

కాని పైన పేర్కొన్న నాలుగు అంశాల్లోని చివరి అంశాన్ని అర్థం చేసుకోవడంలో నేటి కాలపు ప్రజలు తీవ్ర ఇబ్బందుల్ని ఎదుర్కొంటున్నారు. "వడ్డీ నిషేధితం" అనేది కేవలం ఒక ఉద్వేగపూరిత అంశమని, ఇంకా వడ్డీ లేకుండా ఒక వ్యక్తికి అప్పు ఇవ్వడమనేది కేవలం ఒక నైతిక మినహాయింపు అనీ, ఈ విషయంలో మతం అనవసరమైన అతివాదానికి పోయి దాన్ని మహాచెడ్డ నేరంగా పేర్కొంటోందని, నిజానికి వడ్డీ అనేది ఒక సమంజసమైన సహేతుకమైన విషయమని, ఇంకా ఆర్థిక దృష్టికోణంలో ఇది నిరసించ దగినదేమాత్రం కాదనీ, పైగా ఇది క్రియాత్మకంగా మంచి విషయమనీ, అనివార్య అంశమని పెట్టుబడిదారీ సిద్ధాంతకర్తలు నూరిపోశారు. ప్రజల మనోమస్తిష్కాల్లో గాఢంగా నాటుకుపోయేలా చేశారు. ఈ దోషపూరిత సిద్ధాంతం, ముమ్మరంగా ప్రచారం చేసిన కారణంగా ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థలోని ఇతర చెడులపై ప్రపంచంలోని విమర్శకులందరి దృష్టి పడుతుంది గాని అన్నిటికన్నా మహాచెడ్డదైన దీనిపై, దీని మౌలిక లోపంపై ఎవరి దృష్టి కూడా అసలు పోవడమేలేదు. చివరికి సోవియట్ రష్యాకు చెందిన సామ్య వాదులు కూడా పెట్టుబడిదారీ వ్యవస్థలోని ఈ పాపజననిని, బ్రిటన్, అమెరికాల్లాగే తమ దేశంలో కూడా పెంచి పోషిస్తున్నారు. అంతెందుకు? వడ్డీకి బద్ధ శత్రువులుగా ఉండవలసిన ముస్లింలు సైతం పశ్చిమ దేశాలు చేసిన ఈ ప్రచారానికి తీవ్రంగా ప్రభావితులైపోయారు. ఓడిపోయిన మన ధార్మిక వర్గాలు ఒక గొప్ప అపోహకు గురి అయ్యాయి. ఈ అపోహ ఏమిటంటే, వడ్డీ ఒకవేళ నిషిద్ధమైనదైనప్పటికీ కూడా, ఎవరయితే తమ స్వంత అవసరాలకు అప్పు తీసుకుంటారో అలాంటి వారి నుండి వడ్డీ తీసుకోవడం నిషిద్ధం అవుతుంది. కాని తమ వ్యాపారాలను నడుపుకోవడానికి తీసుకునే అప్పులపై వడ్డీ తీసు కోవడం సముచితమే, సమంజసమే. ఇందులో నిషేధించదగిన చెడుగు ఏమీలేదు. ధార్మికంగా, నైతికంగా చూసినా బుద్ధీ వివేకాల రీత్యా, అర్థశాస్త్ర

సూత్రాల రీత్యా - ఏ విధంగా చూసినా అందులో తప్పులేదు- ఇదీ వారి ఆలోచనా విధానం! దీంతోపాటుగానే గడచిన పాత కాలపు వడ్డీ వ్యాపారుల, మహాజన్ల వడ్డీని నేటి బ్యాంకింగ్ వ్యవస్థలోని వడ్డీతో పోల్చుకుని, ఇదేదో వేరే వ్యవస్థ అని, ఈ బ్యాంకింగ్ వ్యవస్థ ఎంతో "శుభ్ర"మైనదని, అందుచేత ఈ వ్యవస్థతో అన్ని రకాల సంబంధాలుంచుకోవడంలో తప్పులేదని తమను తాము వంచించుకుంటున్నారు. దీన్ని ఆధారం చేసుకునే ప్రస్తుతం వడ్డీకి సంబంధించిన ధార్మిక వివరణను, విశ్లేషణను మార్చే ప్రయత్నం జరుగుతున్నది. ఇంకా దివ్యఖుర్ఆన్‌లో ఏ వడ్డీనయితే నిషేధంగా పేర్కొనడం జరిగిందో, ఇది ఆ కోవకు చెందినది కానేకాదని అంటున్నారు. ఈ అపోహలు, అపార్థాలు, తప్పుడు విశ్లేషణల నుండి ఏదో ఒక విధంగా బయటపడ్డవారు కూడా "చట్ట పరంగా వడ్డీని నిషేధిస్తే నేటి కాలంలో ఆర్థిక వ్యవస్థ నిలబడి, నడిచేదెలా?" అనే ఆలోచనలతో కొట్టుమిట్టాడుతున్నారు.

ఇక ముందు మేము ఈ సమస్యల్నే పరిష్కరించడానికి ప్రయత్నిస్తాము.

## వడ్డీని సమర్థిస్తూ ఇవ్వబడే కొన్ని హేతుబద్ధమైన సమాధానాలు

వడ్డీ నిజంగా ఒక సముచితమైన విషయమేనా? అనే అంశం అన్నిటి కంటే ముందు నిర్ధారించబడాలి. ఒక మనిషి తానిచ్చిన అప్పుపై వడ్డీ కోరడం బుద్ధీ జ్ఞానాల రీత్యా హేతుబద్ధమైందేనా? ఒక వ్యక్తి ఎవరినుంచైనా అప్పు తీసుకున్నప్పుడు అప్పుతోపాటుగా ఎంతో కొంత వడ్డీ కూడా ముట్టజెప్పడం ధర్మమేనా? మన చర్చలోని మొట్టమొదటి ప్రశ్న ఇది. ఈ ప్రశ్నకు సమాధానం లభిస్తే సగానికి పైగా మన చర్చ దానంతట అదే పరిష్కరింపబడినట్లే. ఎందుకంటే వడ్డీ ఒక సముచితమైన విషయమని తేలిపోతే ఇక వడ్డీ నిషేధితమనే వాదనలో ఎలాంటి పస ఉండదు. ఒకవేళ బుద్ధీజ్ఞానాలు, హేతువు రీత్యా వడ్డీని

సముచితము, సమంజసమని నిరూపించకపోతే మానవ సమాజంలో అనుచిత మైన, అసహ్యకరమైన ఈ వడ్డీ పిశాచిని కొనసాగించాలని పట్టుబడటం దేనికనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది.

## మొదటి కారణం (హేతువు)

ఈ ప్రశ్నకు జవాబుగా మనకు మొట్టమొదటగా ఎదురయ్యే దృష్టాంతం ఏమిటంటే, ఒక వ్యక్తి వేరొక వ్యక్తికి తాను పొదుపు చేసుకున్న ధనాన్ని అప్పుగా ఇస్తాడు, ఆ విధంగా అతను రిస్క్ తీసుకుంటున్నాడు. త్యాగం చేస్తున్నాడు. తన అవసరాన్ని పక్కకు నెట్టి వేరొకరి అవసరాన్ని తీరుస్తున్నాడు. ఏ ధనంతోనైతే తను స్వయంగా లాభపడగలిగేవాడో, దాన్ని వేరొకరి పరం చేస్తున్నాడు. అప్పు తీసుకునేవాడు ఈ ధనంతో తన ఓ అవసరాన్ని నెరవేర్చుకోవడానికి అప్పు తీసుకుని ఉన్నట్లయితే, అతను ఇల్లు, ఫర్నీచరు, వాహనానికి అద్దె చెల్లించినట్లే ఈ ధనానికి కూడా అద్దె చెల్లించాలి. అప్పిచ్చినవాడు తాను కష్టపడి సంపాదించిన ధనాన్ని తాను వాడుకోవడానికి బదులు ప్రమాదాల్ని ఎదుర్కొని దాన్ని రుణగ్రహీతకు ఇచ్చేస్తున్నాడు. ఒకవేళ రుణగ్రహీత ఈ ధనాన్ని ఒక లాభదాయకమైన పనిలో వినియోగించడానికి ఈ రుణం తీసుకుని ఉంటే, అప్పిచ్చినవాడు దానిపై వడ్డీని కోరుతుంటే దానికతను అన్ని విధాలా అర్హుడే. అప్పు తీసుకున్నవాడు ఆ ధనం ద్వారా లాభపడుతుంటే ఆ లాభంలో నుంచి అప్పిచ్చినవాడు ఎంతో కొంత ఎందుకు తీసుకోకూడదు?

ఒక రకంగా చూస్తే ఈ సంజాయిషీ ఎంతో న్యాయబద్ధంగా ఉంది. అప్పిచ్చినవాడు తన ధనాన్ని వేరొకరికి ఇస్తున్నాడంటే అతను ప్రమాదాన్ని కొనితెచ్చుకుంటున్నాడని, త్యాగం చేస్తున్నాడనే విషయం నిజంగా అంగీకరించదగ్గదే. కాని అతను తీసుకుంటున్న రిస్క్ లేక చేస్తున్న ఈ త్యాగానికి సాలుకు ఐదు శాతం లేక పది శాతం లేక ఆర్నెల్లకు, నెల నెలకు లెక్క కట్టి వసూలు

చేసుకునే హక్కు దీని ద్వారా ఎలా సంక్రమిస్తుంది? రిస్క్ దృష్ట్యా అతనికి ఏ హక్కు అయితే ప్రాప్తమవుతుందో, దాన్ననుసరించి రుణగ్రహీత వస్తువేదైనా తాకట్టు పెట్టుకోవచ్చు. లేదా గ్రహీత వస్తువేదయినా గ్యారంటీగా పెట్టుకొని లేదా మధ్యలో ఎవరినయినా జమానతుగా పెట్టుకొని అప్పివ్వవచ్చు. అంత వరకు అతనికా హక్కు ఉంటుంది. కాదనుకుంటే అసలీ రిస్కే తీసుకో నక్కరలేదు: ఇంకా అప్పివ్వడానికి నిరాకరించాలి. ఇక్కడ రిస్క్ అనుకునేది ఒక విలువ కలిగిన వ్యాపార వస్తువూ కాదు. లేదా చెడిపోయి తరిగి పోతుందని భావించి దాని బాడుగను నిర్ణయించడానికి అది ఇల్లు, ఫర్నీచరు లేక వాహనమూ కాదు. ఇక త్యాగమంటారా? త్యాగం ముసుగులో వ్యాపారం ప్రవేశించనంత వరకే అది త్యాగం అనిపించుకుంటుంది. ఒక మనిషి త్యాగం చేయాలనుకుంటే నిజంగానే త్యాగం చేయాలి. ఇంకా ఈ నైతిక చర్యకు, నైతిక లాభాలతోనే తృప్తిపడాలి. అలా కాకుండా ఈ సద్వ్యవహారానికి బదులుగా భౌతిక లేక ఆర్థిక లాభాన్ని కోరుతున్నట్లయితే, త్యాగమనే ప్రస్తావనే రాకూడదు. సూటిగా వ్యాపార లావాదేవీలకు దిగాలి, ఇంకా అప్పు వ్యవహారంలో అసలు కాకుండా నెలనెలా, లేక సంవత్సరం లెక్కన ఏదైతే అధికంగా వసూలు చేయదలచుకున్నాడో, దానికతను ఎలా అర్హుడో వివరించాలి.

**ఇదో నష్టపరిహారమా?** కాని ఇక్కడ అతనిచ్చిన అప్పు అతని అవసరాలు తీరగా మిగిలి ఉన్న ధనం మాత్రమే అనేది గుర్తుంచుకోవాలి. ఇంకా దాన్ని తాను స్వయంగా కూడా ఉపయోగించడం లేదు. అందుకని అతనిచ్చిన అప్పుపై నష్టపరిహారం రూపంలో ఏదైనా అధికంగా కోరడానికి అతనికెలాటి నష్టమే వాటిల్లలేదే!

**పోనీ ఇదేమన్నా బాడుగనా?** బాడుగకు ఇచ్చే వస్తువులు సమకూర్చడానికి, వాటిని మెయింటెయిన్ చేయడానికి మనిషి తన సమయాన్ని, శ్రమను, ధనాన్ని వెచ్చించాల్సి ఉంటుంది. బాడుగకు ఇవ్వబడే వస్తువులు వాడకంలో

ఉండడం వల్ల విరిగిపోతాయి, తరిగిపోతాయి. ఇంకా అవి తమ విలువను కోల్పోతూ ఉంటాయి. ఈ విషయాలు వాడకంలో ఉండే అనగా ఇల్లు, ఫర్నీచరు, వాహనాలు మొదలగు వాటికైతే వర్తిస్తాయి. అందుకనే వాటికి బాడుగ అనేది ఒక సముచితమైన, సమంజసమైన విషయం. కాని గోధుమలు, పండ్లు, ఫలాలు, డబ్బు మొదలగు వాటికి పైవిషయాలు ఎలా వర్తిస్తాయి? ఇదైతే వివిధ వస్తువులు కొనడానికి, సేవల్ని కొనడానికి ఉపకరించే సాధనం లాంటిది. అందుకని ఇలాంటి వస్తువులకు (వస్తుమారక ద్రవ్యానికి) బాడుగ విధించడం అర్థరహిత విషయం.

ఎక్కువకు ఎక్కువ అప్పిచ్చే వ్యక్తి చెప్పగలిగేదేమిటంటే, నేను ఇంకొక వ్యక్తికి నా ధనంతో లాభపడే అవకాశాన్ని కల్పిస్తున్నాను గనక ఆ లాభంలో నాకు కూడా వాటా లభించాలి. ఈ మాట కాస్త సముచితంగా కనిపిస్తున్నది. అయితే ఇక్కడో ప్రశ్న. ఒక ఆకలిగొన్న అగత్యపరుడు తన పిల్లల పొట్ట నింపడానికి మీ నుండి యాభై రూపాయలు అరువు తీసుకున్నాడనుకోండి. అతను మీరిచ్చిన ధాన్యం లేక డబ్బుతో "లాభం" "ప్రయోజనం" పొందు తున్నాడంటారా? అందులో నుండి నెల నెలా నూటికి రెండు రూపాయల చొప్పునో (లేక అంతకంటే ఎక్కువో) మీరు మీ వాటాను పొందటానికి అర్హులేనంటారా? అతను లాభపడుతున్నాడనడంలో సందేహం లేదు. ఈ లాభ పడే అవకాశాన్ని కూడా మీరే కల్పించారనడంలో కూడా ఎలాటి అనుమానం లేదు. కాని మీ ద్వారా ఇవ్వబడిన ఈ అవకాశాన్ని, మీ ద్వారా ఇవ్వబడిన ఈ అప్పుతో అతను పొందుతున్న లాభానికి ఒక ఆర్థిక విలువను నిర్ణయించి అతని నుండి అధికంగా వసూలు చేయాలని, అతని కష్టాలు పెరిగిన కొద్దీ మీరు వసూలు చేసే ఈ "అధికం" విలువ కూడా పెరిగిపోవాలని, అతని కష్టకాలం ఎంత సుదీర్ఘమైతే మీరిచ్చిన ఈ "లాభపడే అవకాశం" విలువ కూడా

నెలనెలకు, సంవత్సరం సంవత్సరానికి పెరుగుతూ, అధికమవుతూ రావాలనేది బుద్ధీజ్ఞానాలు, హేతువు, అర్థశాస్త్రం, వ్యాపార నియమాలు దేని రీత్యా ఇది మీకు న్యాయమనిపిస్తుంది? ఈ పద్ధతిని మీరెలా సమర్థించుకుంటారు? మీ అవసరాలు తీరిన తరువాత మిగిలి ఉన్న ధనాన్ని ఒక అవసరార్థునికి, ఒక బాధితునికి ప్రసాదించేంత విశాల హృదయం మీ వద్ద లేనపుడు మీరు చేయ వలసిందల్లా ఒక్కటే. అదేమిటంటే మీరిచ్చిన సొమ్ము తిరిగి వస్తుందనే నమ్మకం కుదిరిన తరువాతనే మీరతనికి అప్పియ్యండి. ఒకవేళ అప్పిచ్చే అంతటి విశాల గుణం కూడా మీ హృదయంలో లేకపోతే, అసలతనికి అప్పియ్యకపోవడం కూడా కొంత వరకు మీకు సమంజస మనిపించుకుంటుందేమో! కాని ఒక వ్యక్తి కష్టాలను క్యాష్ చేసుకోవాలనుకోవటం, నిస్సహాయతతో లాభపడే అవకాశాన్ని కల్పించుకోవడం ఏ కోవకు చెందిన వ్యాపారం? పస్తులున్న కడుపులు, కొనఊపిరితో కొట్టుమిట్టాడే రోగులు మీరు ధనాన్ని పెట్టుబడి పెట్టే లేక ఇన్‌వెస్ట్‌మెంటు చేసే సముచిత స్థానాలని మీరెలా అనుకుంటున్నారు? ఇంకా మానవ అవసరాలు, కష్టాలు ఎంతగా పెరిగిపోతుంటాయో, మీ లాభాలు కూడా అంతే పెరుగుతూ పోతాయని మీరు ఆశించడం ఎంత వరకు సమంజసం?

"లాభపడే అవకాశాన్ని కల్పించడం" అనేది ఎప్పుడు వర్తిస్తుంది? అప్పు తీసుకున్న వ్యక్తి ఆ డబ్బును ఒక వ్యాపారంలో వినియోగించినప్పుడు "లాభపడే అవకాశం" అనే మాట వర్తిస్తుంది. అలాటి సందర్భంలో అప్పిచ్చిన వ్యక్తి, తన డబ్బు ద్వారా వేరొక వ్యక్తి, పొందుతున్న లాభంలో తనకు కూడా కొంత వాటా రావాలని కోరే హక్కుంటుంది. కాని ధనం లేక డబ్బు అనేది తనంతట తానుగా లాభం గడించే యోగ్యత కలిగి ఉండదే! మానవ శ్రమ మరియు తెలివితేటలు దానికి తోడైనప్పుడే లాభం పొందే అవకాశం ఏర్పడుతుంది. ఇంకా మానవ

శ్రమ, తెలివితేటలు దానికి తోడైన వెంటనే లాభాల వర్షం కురియడం మొదలు కాదు. అది లాభదాయకంగా మారడానికి ఎంతో కాలం పడుతుంది. అంతే కాకుండా ఈ డబ్బును పెట్టుబడిగా పెట్టి ప్రారంభించిన వ్యాపారం తప్పకుండా లాభాలనే గడిస్తుందన్న గ్యారంటీ ఏమీ లేదు. ఇందులో నష్టం వచ్చే, దివాలా తీసే రిస్క్ కూడా ఉంటుంది. ఇక లాభదాయకమైనదిగా పరిగణించబడినా కూడా అది ఎంత కాలంలో ఎంత లాభం గడిస్తుందనే విషయంలో కూడా ముందుగానే తీర్పు ఇవ్వలేరు. ఇకిప్పుడు ఒక విషయం గురించి చెప్పండి. మానవ శ్రమ, తెలివితేటలు ఇంకా ఆ ధనాన్ని ముట్టుకోక ముందే అప్పు ఇచ్చిన వాని లాభం వెంటనే ఒక నిర్దిష్ట రూపంలో ప్రారంభం కావాలనడం ఎలా సమంజసమనిపించుకుంటుంది? పెట్టుబడితోపాటుగా మానవ శ్రమ, తెలివి తేటలు తోడైనా కూడా ఖచ్చితంగా లాభం వచ్చితీరుతుందని గ్యారంటీ లేనప్పుడు, ఎంత శాతం లాభం వస్తుందో కూడా తెలియనప్పుడు, అప్పిచ్చిన వాని లాభపు శాతం, దాని పరిమాణం మాత్రం ఖచ్చితంగా అప్పివ్వక ముందే నిర్ణయించబడడం ఏ విధంగా న్యాయమనిపించుకుంటుంది?

ఒక వ్యక్తి తాను ఆదా చేసుకున్న డబ్బును ఒక లాభదాయకమైన వ్యాపారంలో పెట్టుబడిగా పెట్టదలుచుకుంటే సముచితము, సమంజసమైన పద్ధతి ఏమిటంటే, అతను కష్టపడుతున్న శ్రమిస్తున్న వారితో భాగస్వామిగా చేరాలి. లాభనష్టాల్లో ఒక నిర్దిష్ట నిష్పత్తితో భాగస్వామిగా వ్యవహారాన్ని కుదుర్చుకోవాలి. కాని ఒక వ్యక్తితో లాభనష్టాల్లో భాగస్వామిగా చేరకుండా, ఒక వ్యక్తికి కొంత డబ్బిచ్చి, ఈ డబ్బుతో నీవు లాభపడతావు గనక ఈ డబ్బుపై ప్రతి నెలా ఇంత శాతం నాకు లాభం ఇచ్చి తీరాలని అనటం ఎంత వరకు ధర్మం? నీ వ్యాపారంలో నా డబ్బు కొనసాగినంత కాలం నిర్దిష్ట పరిమాణంలో నా లాభం నాకు చేరుతూ ఉండడం నా హక్కు అనడం ఎంత వరకు

సమంజసం? ఎంత వరకైతే ఈ ధనాన్ని ఉపయోగించి అతని శ్రమ లాభాన్ని పొందడం మొదలుపెట్టదో, అంతకన్నా ముందే లాభంలోని భాగాన్ని కోరడం విచిత్రం కాదా? ఇలా అడగడం నాకు సమంజసంగా ఉంటుందా? ఒకవేళ రుణగ్రహీత వ్యాపారం చేసి, లాభానికి బదులు నష్టాన్ని చవిచూసినప్పటికీ, నేను మాత్రం "లాభాన్నే" అడగడం నా హక్కు ఎలా అనిపించుకుంటుంది? అతని "లాభం" రూపాయికన్నా తక్కువున్నప్పటికీ, నా లాభం మాత్రం రూపాయే రావాలని కోరడం ఎక్కడి న్యాయం? ఒకవేళ అతని మొత్తం లాభమే ఒక రూపాయి వచ్చిందనుకోండి, అతను నెల రోజుల వరకు తన సమయాన్ని, తెలివితేటల్ని, తన స్వంత పెట్టుబడిని అన్నిటినీ వినియోగించినా కూడా అతనికేమీ మిగులకూడదు, కాని కేవలం వంద రూపాయలే అతనికిచ్చి ప్రక్కకు వైదొలగిన నాకు మాత్రం, అతను సంపాదించిన పూర్తి లాభాన్ని ఎగరేసుకు పోవడం నాకు న్యాయమేనంటారా? ఒక పశువు కూడా రోజంతా గానుగను లాగినందుకు గానుగ వానితో కనీసం మేతను కోరే హక్కు కలిగి ఉంటుందే! కాని వడ్డీతో కూడిన ఈ అప్పు, వ్యాపారం చేసే మనిషిని ఆ పశువు కన్నా హీన స్థితికి దిగజార్చుతుంది. రోజంతా గానుగైతే ఇక్కడ లాగాలి, కాని మేత మాత్రం ఇంకెక్కడి నుండో పొందాలా?

ఒకవేళ ఒక వ్యాపారి లాభం, అప్పిచ్చినవాడు నిర్ణయించిన వడ్డీకి అధికంగా ఉన్నా కూడా ఒక విషయం మాత్రం ఎంతకీ మింగుడుపడేది కాదు. అదేమిటంటే, ఎవరైతే మౌలికంగా ఉత్పత్తిదారులై ఉన్నారో, సమాజ అవసరాలను తీర్చే, సమకూర్చే ప్రాథమిక కార్యకర్తలై ఉన్నారో, ఈ ఉత్పత్తి, సరఫరాల కోసం తమ సమయాన్ని, శ్రమను, తమ శక్తియుక్తులన్నింటినీ ఒడ్డి, సమాజ అవసరాల్ని తీరుస్తున్నారో, ఉదాహరణకు వ్యాపారులు, వివిధ వృత్తిపనుల వాళ్ళు (అనగా వడ్రంగి, కంసాలి, పద్మశాలి, గానుగవాళ్ల ఇలా

వివిధ వృత్తులు కలిగిన (ప్రాథమిక పనివాళ్ళు) రైతులు, ఇంకా ఇలాంటి మౌలిక ప్రాథమిక కార్యకర్తలు - వీరి లాభం, రాబడి అయితే డోలాయ మానంగా, అనిశ్చితంగా ఉండాలి, కాని తాను కూడబెట్టిన ధనాన్ని అప్పుగా ఇచ్చిన ఆ ఒక్క మనిషి లాభం మాత్రం నిశ్చితంగా, నిర్దిష్టంగా ఉండాలి. పై వారందరి విషయంలో నష్టానికి కూడా ఆస్కారముంది. కాని ఈ ఒక్క మనిషికి మాత్రం ఖచ్చితంగా లాభపు గ్యారంటీయే ఉండాలి. పై వారందరి లాభ నిష్పత్తి మార్కెట్ వైపరీత్యాలతో, ధరలతో ముడిపడి తరుగుతూ, పెరుగుతూ ఉంటుంది. కాని ఈ ఒక్క మహాశయుడు మాత్రం తన నిర్ణీత లాభాన్ని నిశ్చింతగా మూటగట్టు కుంటాడు. అదెట్టి పరిస్థితుల్లోనైనా సరే, నెల నెలకు, సాలు సాలుకు అతనికి వచ్చితీరాలి.[2]

---

*2. ఇక్కడో వ్యక్తి భూమి కౌలుకు సంబంధించిన విషయాన్ని మీరెలా సమర్థిస్తారని, అది కూడా ఒక రకంగా వడ్డీని పోలినట్లే ఉంటుందని అభ్యంతరాన్ని లేవదీసే అవకాశముంది. భూమికి నగదు కౌలును అనగా ఎకరాకు 5000/- లేక 10,000/- అంటూ ముందే ధరను ఖరారు చేసుకోవడాన్ని అనుమతింపబడినదిగా భావించే వారే ఈ అభ్యంతరాన్ని ఎదుర్కోవలసి ఉంటుంది. నేను మటుకు దీన్ని సమర్థించను. నేను కూడా దీన్ని ఒక విధమయిన వడ్డీగానే భావిస్తాను. అందుకని ఈ అభ్యంతరానికి సమాధానం ఇచ్చే బాధ్యత నాపై లేదు. నా పద్ధతి ఏమిటంటే, భూస్వామి మరియు రైతు, భూమి పంటలో పాలుపంచుకోవడం. అంటే భూమిలో పండిన పంటలో ఇంతభాగం భూస్వామిదని, ఇంత భాగం రైతుదని ముందే ఒప్పందం చేసుకోవాలి. ఇది వ్యాపారంలో భాగస్వామ్యపు పద్ధతిని పోలి ఉంటుంది. ఈ పద్ధతిని నేను జాయెజ్ (అనుమతింపబడినది) గా భావిస్తాను. ఇక భూమిని*

## రెండవ కారణం

పై విమర్శలు, విశ్లేషణల ద్వారా వడ్డీని సమర్థిస్తూ అదొక సముచిత మైన, సమంజసమైన విషయమని తెలుపుతూ ఇవ్వబడే దృష్టాంతాలు, కారణాలు ఎంత బలహీనమైనవో కాస్త లోతుకుపోయి పరిశీలిస్తే అవలీలగా అర్థమైపోతుంది. ఇక వ్యక్తిగత అవసరాల కోసం తీసుకోబడే అప్పులపై వడ్డీ విధించడానికైతే హేతుబద్ధమైన ఎలాంటి ఆధారమూ లేదు. చివరికి వడ్డీని సమర్థించేవారు కూడా స్వయంగానే ఈ వాదన నుండి తప్పుకున్నారు. ఇక వ్యాపార కార్యకలాపాల కోసం తీసుకోబడే అప్పులపై వసూలు చేసే వడ్డీ కూడా అసలది దేనికి మూల్యం? అనే చిక్కు ప్రశ్నను వారు ఎదుర్కోవాల్సి వస్తుంది. అప్పిచ్చే వ్యక్తి, అప్పు గ్రహీతకు మౌలికమైన (Substantive) ఏ వస్తువును ఇస్తున్నాడని- దానికి ఓ ఆర్థిక విలువను నిర్ధారించి ప్రతి నెల, ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా దాని విలువను వసూలు చేసుకునే హక్కు అతనికి ప్రాప్తించటానికి? ఆ వస్తువు లేక ఆ విషయమేదో గుర్తించి చూపడానికి వడ్డీ సమర్థకులు నానా తంటాలు పడాల్సి వస్తుంది.

దీనికి సంబంధించి ఒక వర్గం వారు "లాభం పొందే అవకాశాన్ని కల్పిస్తున్నాము కదా!" అంటారు. ఈ 'అవకాశం' ఒక నిర్ణీత, నిశ్చిత మరియు రోజురోజుకు పెరిగే విలువకు అర్హతను ప్రసాదించజాలదని పైన జరిగిన చర్చ ద్వారా మీరు తెలుసుకునే ఉంటారు. దానికి భిన్నంగా అది కేవలం ఒకే ఒక సందర్భంలో - అనగా అప్పు గ్రహీత నిజంగానే లాభం పొందినప్పుడు మాత్రమే లాభానికి అర్హతనిస్తుంది.

---

బాడుగకు ఇచ్చే విషయం; ఇందులో ఏ పద్ధతి అనుమతింపబడినదనే విషయంగా "భూయాజమాన్య సమస్య" అనే నా పుస్తకంలో వివరించాను. ఇంకా దానికి ఈ అభ్యంతరం వర్తించదు.

ఇంకొక వర్గం వారు కాస్త పొజిషన్‌ను మార్చి అనేదేమిటంటే, అప్పిచ్చినవాడు తన పెట్టుబడిని ఇస్తూ దాని ఉపయోగం కోసం "వ్యవధి" ఇస్తున్నాడు. స్వయంగా ఈ వ్యవధే (గడువే) తనదంటూ ఒక విలువను కలిగి ఉంటుంది. ఇంకా ఇది ఎంత సుదీర్ఘమై ఉంటుందో, దాని విలువ కూడా అంతే పెరుగుతూ పోతుంది. ఏ రోజైతే అప్పు గ్రహీత డబ్బును పొంది పనిలో పెట్టిస్తాడో ఆ రోజు మొదలుకొని, ఈ పెట్టుబడి ద్వారా తయారు చేయబడిన సరుకు బజారులో చేరి ధర పలికేంత వరకు మధ్యలోని ఒక్కొక్క ఘడియ వ్యాపారి కోసం అత్యంత విలువైనది. ఈ వ్యవధే గనక అతనికి దొరక్కపోతే, మధ్యలోనే పెట్టుబడి అతని నుండి తిరిగి తీసేసుకుంటే అసలతని వ్యాపారమే నడవదు. అందుచేత ఈ వ్యవధి లేక గడువు అప్పు తీసుకున్న వాని పాలిట నిశ్చయంగా ఒక 'విలువే'. దాంతోనే అతను లాభపడుతున్నాడు. అలాంటప్పుడు అప్పిచ్చినవాడు ఈ లాభం నుండి ఎందుకు తన 'వాటా' తీసుకోకూడదు? అంతేకాకుండా ఈ వ్యవధి లేక సమయంలో వచ్చే హెచ్చుతగ్గుల కారణంగా అప్పుగ్రహీత లాభపు అవకాశాల్లో కూడా తప్పనిసరిగా హెచ్చు తగ్గులు జరుగుతూ ఉంటాయి. కాబట్టి ఈ వ్యవధిలోని దీర్ఘకాల, స్వల్ప కాలాల దృష్ట్యా అప్పిచ్చినవాడు దాని 'విలువ'ను ఎందుకు నిర్ణయించకూడదు?

ఇక్కడ తిరిగి ఉత్పన్నమయ్యే ప్రశ్న ఏమిటంటే, అప్పు తీసుకొని వ్యాపారంలో పెట్టుబడిగా పెట్టిన వ్యక్తి తప్పకుండా లాభాలే గడిస్తాడని, ఎలాంటి నష్టాన్నీ ఎదుర్కోడని అప్పిచ్చిన వానికి ముందే ఎలా తెలిసిపోయింది? అంతే కాకుండా ఆ వ్యాపారం ద్వారా అతను ఇంత శాతం లాభం గడిస్తాడని, అందుకని అందులో తనకు ఇంత శాతం వాటా రావాలని అతనెలా బేరీజు వేయగలిగాడు? ఏ వ్యవధి లేక సమయం వరకు అతను అప్పు గ్రహీతకు తన ధనాన్ని వినియోగించుకునే అవకాశాన్ని ఇస్తున్నాడో, ఆ వ్యవధిలో ప్రతి నెలా, ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా ఇంత లాభం వస్తుందని, అందుచేత

తానిచ్చిన ఈ వ్యవధిలో తనకు ప్రతి నెలా, ప్రతి సంవత్సరం ఇంత లాభం వాటాగా రావాల్సి ఉంటుందని అతను ముందే ఎలా ఊహించగలిగాడు? ఈ ప్రశ్నలకు వడ్డీ సమర్ధకుల వద్ద సముచితమైన సమాధానాలు లేవు. అందుకని చర్చ తిరిగి ఎక్కడికి చేరుకుంటుందంటే వ్యాపార వ్యవహారాల్లో "లాభనష్టాల్లో భాగస్వామ్య" మొక్కటే సముచితమైన పద్ధతి. ఒక నిర్ణీత షరతుపై ముందే నిర్ణయించబడే వడ్డీ ఎంత మాత్రం సమ్మతం కాదు.

## మూడవ కారణం

ఇంకొక వర్గపు వాదన ఏమిటంటే, లాభం గడించటమనేది పెట్టుబడి లేక మూలధనం స్వంత గుణమని, అందుకని ఒక వ్యక్తి ద్వారా సమకూర్చ బడిన పెట్టుబడిని వేరొక వ్యక్తి వినియోగించాడంటేనే అప్పిచ్చిన వాడు వడ్డీ అడగడానికిన్నీ, అప్పు గ్రహీత వడ్డీ ఇవ్వడానికిన్నీ హక్కు కలిగిస్తుందని వారు వాదిస్తారు. నిత్యావసర వస్తువుల తయారీ మరియు సరఫరా చేయగలిగే శక్తి పెట్టుబడికి (ధనానికి) ఉంటుంది. పెట్టుబడి మూలంగా ఎన్ని సరుకులైతే సిద్ధమవుతాయో, అవి సహాయం అందించకపోతే సాధ్యమే కావు. పెట్టుబడి సహాయం అందితేనే అధిక పరిమాణంలో మంచి సరుకు తయారవుతుంది, ఇంకా మంచి ధర పలికే అంగళ్ళ వరకు చేరగలుగుతుంది. అదే గనక లేక పోతే, తక్కువ పరిమాణంలో, నాసిరకం సరుకు తయారవుతుంది. ఇంకా మంచి ధర పలికే సమయానికల్లా అక్కడికి చేరుకోలేదు. లాభం కలిగించే గుణం పెట్టుబడి (ధనం)లోనే చేర్చబడిందని నిరూపించడానికి ఇదొక్క విషయమే చాలు. అందుకని కేవలం దాని వినియోగమే వడ్డీకి అర్హతను సాధించి పెడుతుంది.

కాని పెట్టుబడి (ధనం)లోనే స్వయంగా లాభం ఆర్జించే గుణం ఉంది అనడమే అసలు తప్పు. ఒక మనిషి దీన్ని తీసుకొని ఒక లాభదాయకమైన

పనిలో వినియోగించినప్పుడే (లాభం చేకూర్చే) ఈ గుణం దానికొస్తుంది. అప్పుడే డబ్బు తీసుకున్న మనిషి దీంతో ఒక లాభదాయకమైన పని తీసుకుంటు న్నాడు గనక లాభంలో అతనికి వాటా కావాలని మీరు అడిగే ఆస్కారముంది. అయితే అప్పు తీసుకున్న ఈ మనిషి దాన్ని వైద్య సేవల కోసం వినియో గిస్తున్నప్పుడు, లేక ఒక శవానికి అంత్యక్రియలు చేయడంలో వినియోగించి నప్పుడు ఈ పెట్టుబడి (ధనం)తో అతనేం ఆర్థిక లాభాన్ని పొందాడని మీరతని వద్ద లాభంలో వాటా అడుగుతున్నారు?

ఏ పెట్టుబడినైతే లాభదాయకమైన పనుల్లో వినియోగించడం జరుగు తుందో, అక్కడ కూడా, లాభం గడించడమే దాని సహజ గుణమని ఛాలెంజ్ చేయడానికి, అది తప్పనిసరిగా అధిక ధరల్ని రాబడుతుందన్న గ్యారంటీ ఏమీ లేదు. కొన్ని సందర్భాల్లో ఏదైనా ఒక పనిలో అధిక పెట్టుబడిని పెట్టడం వల్ల లాభం పెరగడానికి బదులు తరుగుతుంది. చివరికది నష్టాన్ని కలిగించే స్థితికి చేరుకుంటుంది. నేటి కాలంలో వ్యాపార జగత్తులో అప్పుడప్పుడు వస్తున్న సంక్షోభాని(Crisis)కి కారణం ఏమనుకుంటున్నారు? పెట్టుబడిదారులు వ్యాపారంలో విచ్చలవిడిగా, పెద్ద మొత్తంలో పెట్టుబడులు పెడుతూ పోతున్న ప్పుడు ఉత్పత్తి కూడా పెరుగుతూ పోతుంది. ఫలితంగా ధరలు పడిపోనా రంభిస్తాయి. ఇంకా సరుకుల సమృద్ధి, ధరల్లో క్షీణత - ఈ రెండూ కలిసి ఎక్కడికి దారి తీస్తాయంటే చివరికి పెట్టుబడి పెట్టినా లాభం వచ్చే అవకాశం లేకుండాపోతుంది.

అదీగాక పెట్టుబడి లేక మూలధనంలో లాభం చేకూర్చే ఏదైనా గుణమున్నప్పటికీ అది శక్తివంతంగా ఉనికిలోకి రావాలన్నా కూడా ఇంకెన్నో విషయాలపై అది ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు దాన్ని ఉపయోగించే వారి శ్రమ, తెలివితేటలు, నైపుణ్యం, అనుభవం - అది వినియోగంలో ఉన్న సమయంలో ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితుల సానుకూలత, మార్కెట్

వైపరీత్యాల నుండి, ప్రకృతి వైపరీత్యాల సంరక్షణ– ఇవి ఇంకా ఇలాటివే ఇతర అంశాలు ఎన్నో లాభార్జనకు అనివార్య షరతులు. పై వాటిలో ఏ ఒక్కటి అనుకూలించకపోయినా, పెట్టుబడి (ధనాని)కి ఉన్న లాభదాయక గుణం దెబ్బతినటమే కాకుండా కొన్ని సందర్భాల్లో నష్టంగా పరిణమిస్తుంది. అయితే వడ్డీ వ్యాపారంలో పెట్టుబడి సమకూర్చే వాడికి ఇవేవీ పట్టవు. అతను ఎలాంటి రిస్కూ తీసుకోడు. ఇంకా పై షరతుల్లో ఏదైనా లోపం లేక ఆటంకం వచ్చి అతని పెట్టుబడి లాభదాయకం కానప్పుడు తాను వడ్డీ తీసుకోనని హామీ కూడా ఇవ్వడు. అతను చెప్పేదొక్కటే - నేను పెట్టుబడి పెట్టాను. అదొక్కటే ఓ నిర్దిష్ట పరిమాణంలో వడ్డీ పొందడానికి అర్హతనిస్తుంది, తను సమకూర్చిన సొమ్ము వల్ల వాస్తవంగా ఏదైనా లాభం వచ్చిందా? రాలేదా? అనేది తనకు అనవసర మంటాడు.

సరేనండీ, కాస్సేపటి కోసం పెట్టుబడి (ధనం) లోనే స్వతహాగా లాభం పుట్టించే గుణం నిక్షిప్తమై ఉందని, దాని ఆధారంగా పెట్టుబడి (ధనం) సమకూర్చేవాడు లాభంలో వాటా పొందడానికి అర్హుడే అని అంగీకరిద్దాం. అయినాసరే పెట్టుబడిని (ధనాన్నీ) సమకూరిస్తే, నికరంగా ఇంత లాభం వస్తుందని, అందుకని పెట్టుబడిని (ధనాన్ని) స్వీకరించి వ్యాపారంలో వినియోగిస్తున్న వారు తప్పనిసరిగా ఇంత నిష్పత్తితో వడ్డీని చెల్లించాలని ఏ లెక్కల ఆధారంగా తెలుసుకోవడానికి ఆస్కారముంది? లాభమే నికరంగా లేదు. లాభం వస్తుందో, నష్టాన్ని ఎదుర్కోవాల్సి వస్తుందో తెలియని అనిశ్చిత పరిస్థితుల్లో, వడ్డీ శాతాన్ని నిర్దిష్టంగా పేర్కొనడానికి తావెక్కడ? ప్రస్తుత కాలం కోసం ఏదో గణితాల ఆధారంగా ఈ నిష్పత్తితో వడ్డీ ఇవ్వడం సంభవమని అంగీకరిద్దామే అనుకోండి. అయితే ఏ పెట్టుబడిదారుడైనా నేడు (అనగా 1949లో) ఒక వ్యాపార సంస్థకు పది సంవత్సరాల కోసం, వేరొక సంస్థకు ఇరవై సంవత్సరాల కోసం ఇప్పుడున్న వడ్డీరేటుపై అప్పిచ్చాడనుకోండి.

అప్పుడతని వద్ద వచ్చే పది సంవత్సరాల్లో, లేక ఇరవై సంవత్సరాల్లో పెట్టుబడి యొక్క లాభదాయకత తప్పకుండా నేటి స్థాయిపైనే స్థిరంగా ఉంటుందని తెలుసుకోవడానికి ప్రమాణమేమిటో మాకైతే అర్థంకావడం లేదు. ప్రత్యేకించి 1959లో మార్కెట్‌లోని వడ్డీరేటు 1949కి భిన్నంగా ఉండి, ఇంకా 1969 వచ్చే వరకు ఇంకా అత్యధికంగా భిన్నమై పోతుందే. ఇలాటి పరిస్థితుల్లో ఒక సంస్థతో పది సంవత్సరాల కోసం, వేరొక సంస్థతో ఇరవై సంత్సరాల కోసం 1949లో ఆనాటి 'వడ్డీ రేటు' ప్రకారం తన పెట్టుబడిపై రాబోయే లాభం నుండి తన వాటా (వడ్డీ)ను నిశ్చితం చేసుకున్న వ్యక్తిని ఏ దృష్టాంతంతో సత్యవాదిగా అంగీకరిద్దాం?

## నాలుగవ కారణం

చివరి దృష్టాంతం కోసం కాస్త ఎక్కువ తెలివిని వెచ్చించడం జరిగింది. దాని వివరాలు ఇలా ఉన్నాయి:

మనిషి తన నైజం రీత్యా తన ముందున్న, సమక్షంలో ఉన్న లాభాల్ని, రుచులను జుర్రుకోవాలని ఆరాటపడతాడు. కనుచూపు మేరలో లేని వస్తువులకన్నా, ఆలస్యంగా లభించే వాటికన్నా తొందరగా లభించే వాటిని పొందాలని చూస్తాడు. భవిష్యత్తు ఎంత దూరంగా ఉంటుందో, దాని లాభాలు, రుచులు అంతే అనుమానాస్పదమవుతాయి. ఈ రీతిలోనే మనిషి దృష్టిలో వాటి విలువ తగ్గుతూ పోతుంది. ఈ దగ్గరి వాటి పట్ల ఆసక్తి, దూరపు వాటి పట్ల అనాసక్తతకు అనేక కారణాలున్నాయి. ఉదాహరణకు:

1. భవిష్యత్తు అనేది చీకట్లో ఉండడం (కనిపించకపోవడం), ఇంకా జీవితం అనిశ్చితంగా ఉండడం - దీని కారణంగా భవిష్య లాభాలు అనుమానాస్పదంగా ఉంటాయి. ఇంకా వాటి రూపాలు కూడా మనిషి ఊహా, ఆలోచనలకు అందవు. తద్భిన్నంగా నేడు నగదుగా లభిస్తున్న

లాభాలు నిశ్చితమైనవి, ఇంకా మనిషి వాటిని తన చర్మచక్షువులతో వీక్షిస్తున్నాడు.

2. ఒక వ్యక్తి ఈ సమయంలో అవసరం పడి ఉన్నాడు. అతని అవసరం ఈ సమయంలో తీరడం అతని దృష్టిలో అత్యధిక విలువ కలిగి ఉంటుంది. భవిష్యత్తులో ఎప్పుడో అతనికి ఆ వస్తువు లభించినా బహుశా అప్పుడు అతనికి దాని అవసరం ఉండనూ వచ్చు, ఉండక పోనూ వచ్చు.

3. ఏ ధనమైతే ప్రస్తుతం అతనికి లభిస్తున్నదో, అది క్రియారూపంలో లాభించేదిగానూ, వినియోగింపదగినదిగానూ ఉంటుంది. ఈ దృష్టితో భవిష్యత్తులో ఎప్పుడో లభించబోయే ధనంపై, ఇప్పుడున్న సొమ్ముకు ఎంతో ప్రాముఖ్యం ఉంటుంది.

పై కారణాల వల్ల ప్రస్తుతం కళ్ల ముందున్న నగదు లాభం, సుదూరాన ఉన్న అనుమానాస్పద లాభంపై ప్రాధాన్యతను సంతరించుకుంటుంది. నేడు ఒక వ్యక్తి అప్పు తీసుకుంటున్నాడు. దాని విలువ రేపు అతను అప్పిచ్చిన వానికి చెల్లించబోయే రొక్కం కన్నా తప్పనిసరిగా అధికంగా ఉంటుంది. ఇంకా వడ్డీ అనేది ఆ 'అధిక విలువే'. ఇదే అప్పు తీర్చేటప్పుడు అసలుతో కలిసి, అతను అప్పు తీసుకుంటున్నప్పుడు తీసుకున్న రొక్కానికి సమానమవుతుంది. ఉదాహరణకు దీన్ని ఒక వ్యవహారం ద్వారా తెలుసుకుందాం. ఒక వ్యక్తి ఒక షావుకారు వద్దకు వచ్చి వంద రూపాయలు అప్పు అడుగుతాడు. ఆ షావుకారు తానిప్పుడిస్తున్న వంద రూపాయలకు బదులు ఒక సంవత్సరం తరువాత నూట పదమూడు రూపాయలు తీసుకుంటానని ఒప్పందం కుదుర్చుకుంటాడు. ఈ వ్యవహారంలో ప్రస్తుతమున్న (ప్రత్యక్షంగానున్న) వంద రూపాయల మారకం భవిష్యత్తులోని నూట పదమూడు రూపాయలతో జరుగుతుంది. పదమూడు రూపాయల ఈ భేదం ప్రత్యక్ష ధనం మరియు భవిష్యధనం యొక్క మానసిక

(ఆర్థిక కాదు) విలువలో నిక్షిప్తమై ఉంటుంది. ఎప్పటి వరకైతే ఈ పదమూడు రూపాయలు ఒక సంవత్సరం తరువాత వంద రూపాయలతో జత కలువవో, దాని విలువ అప్పు తీసుకునేటప్పుడు తీసుకున్న వంద రూపాయలకు సమానం కాదు.

ఈ కారణాన్ని ఎంత చాకచక్యంగా, మరెంత సహేతుకంగా సమర్పించారంటే, దాన్ని ప్రశంసించకుండా ఉండలేము. ప్రశంసించకపోవడం అన్యాయ మనిపిస్తుంది. కాని వాస్తవంగా ఇందులో వర్తమాన మరియు భవిష్యత్తుల మానసిక విలువలో ఏ తేడానయితే చూపించడం జరిగిందో అదో మాయ తప్ప ఇంకేమీ కాదు.

మానవ నైజం వాంఛించేదేమిటి? అది ఎంతసేపటికీ వర్ధమానాన్నే కోరుకుంటుందా? భవిష్యత్తును గురించి ఆలోచించదా? భవిష్యత్తుకు విలువ ఇవ్వదా? ఇదే నిజమనుకుంటే అత్యధిక మంది తమ సంపాదన అంతా నేడే ఖర్చుపెట్టడానికి ఇష్టపడక, అందులోని ఒక భాగాన్ని భవిష్యత్తు కోసం మిగిల్చి ఉంచడానికే ఇష్టపడడానికి కారణం ఏమై ఉంటుందంటారు? రేపటి గురించిన ఆలోచనే లేని, నేటి సౌఖ్యానికే, రసాస్వాదనకే తమ సంపాదన నంతటినీ తగుల బెట్టడానికి ఇష్టపడేవారు బహుశా ఒక శాతం మనుషులు కూడా మీకు లభించరు. కనీసం 99 శాతం మంది నేటి అవసరాలను కొన్నింటిని ప్రక్కకు నెట్టి, రేపటి కోసం ఎంతో కొంత ఆదా చేసి ఉంచాలని తలుస్తారు. దీనికి కారణం ఏమిటంటే భవిష్యత్తులో రాబోయే అనేకానేక ఒడిదుడుకులను, తెలియకుండా వచ్చి పడే అనేక అవసరాలు, సందర్భాలు, కష్టాలు మనిషి మనోమస్తిష్కాల్లో మెదులుతూ ఉంటాయి. కనుక నేటి పరిస్థితుల కన్నా ఇంకా గడ్డు పరిస్థితులు భవిష్యత్తులో వచ్చే అవకాశాలు, శంకలు, అనుమానాలు ఉన్న కారణంగా, ప్రస్తుత జీవితాన్ని ఎలాగోలా నెట్టుకుంటూ వస్తూ, భవిష్య పరిస్థితుల కోసం సంసిద్ధంగా ఉండడానికి ప్రయత్నిస్తాడు. ఒక మనిషి ప్రస్తుత

కాలంలో పడుతున్న శ్రమ, వ్యయప్రయాసలు దేనికోసం? అతని భవిష్యత్తు ప్రస్తుత కాలంకన్నా సుఖంగా, ప్రశాంతంగా, సౌఖ్యంగా గడువాలనే కదా? నేడతను పడుతున్న శ్రమకు ఫలాలు భవిష్యత్తులో లభిస్తాయని, భవిష్య జీవితం నేటికన్నా సుఖంగా, ఉన్నతంగా ఉండాలని కోరుకుంటాడు. భవిష్యత్తు నాశనమైపోయినా సరే, లేక ప్రస్తుతంకన్నా చెడు కాలం దాపురించినా సరే గాని వర్తమానాన్ని, ప్రస్తుత కాలాన్ని సౌఖ్యంగా, హాయిగా గడుపుతానని ఆలోచించే పిచ్చివాడు ఏ ఒక్కడూ మీకు దొరకడు. భవిష్యనాశనపు విలువ చెల్లించి వర్తమాన సౌఖ్యాన్ని ఎవరూ కాంక్షించరు. మూర్ఖత్వం, అవివేకం కారణంగానో లేక క్షణికావేశానికి లోనయినందునో లేక తాత్కాలిక మనో కాంక్షల పెను తుఫానుల్లో చిక్కుకున్నందునో ఎవరైనా అలా చేస్తే అది వేరే విషయం. కాని ఆలోచనా వివేకాలు, బుద్ధిజ్ఞానాలు ఉన్న ఏ వ్యక్తి కూడా ఇలాంటి చర్యను సముచితమైనదిగా, సమంజసమైనదిగా సమర్థించుకోలేడు.

కాస్సేపటి కోసం మీ వాదనను అంటే "మనిషి ప్రస్తుత లాభం లేక ప్రశాంతత కోసం భవిష్య నష్టాన్ని ఓర్చుకుంటాడనే" వాదనను అంగీకరించామే అనుకోండి. అయినా కూడా ఈ దృష్టాంతం ఈ వాదనకు బలం చేకూర్చడం లేదు. ఇది మీ వాదనను, మీ పక్షాన్ని సమర్థించడం లేదు. అప్పు తీసుకునేటప్పుడు అప్పిచ్చిన వానికి - అప్పు గ్రహీతకు మధ్య జరిగిన ఒడంబడిక మీరు పేర్కొన్న ప్రకారం ప్రస్తుత వంద రూపాయల విలువ ఒక సంవత్సరం తరువాత 113 రూపాయలకు సమానంగా ఉంటుంది. కాని ఇప్పుడు అంటే ఒక సంవత్సరం తరువాత అప్పు గ్రహీత తన అప్పును తీర్చడానికి వెళ్లినప్పుడు వాస్తవంలో వ్యవహార పరిస్థితి ఎలా ఉంది? ప్రస్తుత 113 రూపాయలు గడిచిన కాలపు (భూతకాలపు) 100 రూపాయలకు సమానమైనాయి. ఒకవేళ మొదటి సంవత్సరం గడిచిపోయిన తరువాత కూడా అప్పు గ్రహీత తన అప్పును తీర్చలేకపోయినప్పుడు రెండవ సంవత్సరపు చివరలో భూతకాలపు 100

రూపాయల విలువ ప్రస్తుతపు (వర్తమానపు) 126 రూపాయలకు సమానమై పోతుంది. వాస్తవంలో కూడా భూత మరియు వర్తమాన (ప్రస్తుత) కాలాల రేటు, విలువల ఇదే నిష్పత్తి ఉందా? ఇంకా భూతకాలం ముందుకు సాగుతూ పోయినకొద్దీ, దాని విలువ కూడా ప్రస్తుత (వర్తమాన) కాలానికి అభిముఖంగా పెరుగుతూ పోవాలనే నియమం వాస్తవమైనదేనా? గడచిన అవసరాల పరిపూర్తి మీ దృష్టిలో అంతటి విలువ కలిగి ఉందా? ఏ డబ్బయితే ఎంతో కాలం పూర్వం మీకు లభించిందో, ఇంకా దాన్ని వాడి, వినియోగించి మీరు చేతులు దులుపుకున్నారో, అది మీ కోసం కాలం గడుస్తున్నకొద్దీ ప్రస్తుత రూపాయలకన్నా అధిక విలువైనదిగా మారుతూపోతుందా? చివరికి ఒక వంద రూపాయలు మీరు వాడుకున్న తరువాత యాభై సంవత్సరాలు గడిచాయనుకోండి. ఇప్పుడు దాని విలువ 750 రూపాయలకు సమానమవుతుందా?

## వడ్డీ రేటు యొక్క 'ఔచిత్యం'

వడ్డీ ఆసాముల సమర్థకులు వడ్డీని బుద్ధీజ్ఞానాల దృష్ట్యా, విజ్ఞతా వివేచనల రీత్యా, న్యాయం దృష్ట్యా ఉచితమని, సమంజసమని నిరూపించ డానికి ఇచ్చే కొన్ని దృష్టాంతాలు మీరు పైన చదువుతూ వచ్చారు. సముచితం, సమంజసత్వంతో ఈ అపవిత్ర వస్తువుకు దూరపు సంబంధం కూడా లేదని పై వాదాలు, చర్చలు, విమర్శల ద్వారా మీరు అర్థం చేసుకొనే ఉంటారు. అసలు వడ్డీ ఎందుకివ్వాలి? ఎందుకు తీసుకోవాలి? అనే దానికి ఎంత గట్టి వాదనతో నైనా, ఎంత పెద్ద దృష్టాంతంతోనైనా నిరూపించే ఔచిత్యమే లేదు. కాని విచిత్ర మేమిటంటే ఇంతటి అసమంజసమైనదాన్ని, అనుచితమైనదాన్ని పాశ్చాత్య విద్వాంసులు, తత్వజ్ఞానులు పూర్తిగా ఆమోదిత స్వతస్సిద్ధమైన వాటిలో చేర్చు కున్నారు. వడ్డీ ఔచిత్యాన్ని దాదాపుగా ఒక పరిష్కృత సత్యంగా, అంగీక రింపబడిన వాస్తవంగా పరిగణించి, తమ దృష్టినంతా కేవలం దాని "రేటు"పై

రేటు "ఔచిత్యం"పైనే కేంద్రీకరించారు. అసలు వడ్డీయే ఇచ్చిపుచ్చుకునే విషయమా? కాదా? అనే అంశంపై ఆధునిక పాశ్చాత్య సాహిత్యంలో బహు తక్కువ చర్చ లభిస్తుంది. దానికి బదులు వడ్డీకి సంబంధించిన ఫలానా రేటు సముచితమైనదని, అందుచేత అది ఆమోదయోగ్యమని, ఇంకా ఫలానా రేటు అనుచితమని అత్యధికమైనదని అందుకని అది ఆక్షేపణీయమని – ఈ రకమైన చర్చలు మాత్రమే కానవస్తాయి.

అయితే వడ్డీకి సంబంధించిన ఏ రేటు లేక నిష్పత్తి అయినాసరే, అసలది ఉచితమైనదేనా? స్వతహాగా ఏ విషయమయితే అసలు సముచితమే కాదో దాని రేటు నిష్పత్తికి సంబంధించి చర్చించడానికి ఆస్కారమెక్కడుంది? సరే ఈ ప్రశ్నను ఇక్కడే వదిలేసి, వడ్డీ యొక్క స్వాభావిక మరియు సముచిత మనగలిగే ఆ రేటు ఏదో మేము తెలుసుకోదలిచాము. వడ్డీ యొక్క ఫలానా రేటు సక్రమమైనదని, ఫలానా రేటు అక్రమమైనదని నిర్ణయించడానికి ఆ కొలమానం లేక ప్రమాణం ఏది? ఇంకా వాస్తవంలో ఆచరణ రూపంలో ప్రపంచంలోని వడ్డీ వ్యాపారాల్లో వడ్డీ రేట్ల నిర్ణయం హేతుబద్ధం (Rational) గానే జరుగుతున్నదా?

ఈ ప్రశ్నకు సంబంధించి మనం పరిశోధన జరిపినట్లయితే న్యాయ మైన వడ్డీ రేటు అనేది ఏనాడూ ఈ ప్రపంచంలో ఉనికిలోకి రాలేదనే వాస్తవాన్ని మనం కనుగొంటాము. వివిధ రేట్లను, వివిధ కాలాల్లో సముచిత మని, న్యాయసమ్మతమనీ నిర్ణయించారు. అయితే ఆ రేట్లే తరువాతి కాలంలో అనుచితంగా, అక్రమమైనవిగా ఖరారై కొట్టివేయబడ్డాయి. అంతేకాకుండా ఒకే కాలంలో, ఒక ప్రదేశంలో సక్రమ వడ్డీ రేటు ఒకటుంటే, వేరొక ప్రాంతంలో ఆ రేటు ఇంకో రకంగా ఉండేది - ప్రాచీన భారతంలో కౌటిల్యుడు పేర్కొన్న దానిననుసరించి ఏడాదికి 15 నుండి 60 శాతం వడ్డీ రేటు అత్యంత సక్రమ మైనదిగా, సమ్మతింపబడినదిగా భావించబడేది. ఇంకా ఒకవేళ పరిస్థితి

సంక్లిష్టంగా ఉంటే అంతకన్నా ఎక్కువ శాతం కూడా సముచితంగా భావించబడేది. పద్దెనిమిదవ శతాబ్దపు మధ్య మరియు చివరి భాగంలో, పందొమ్మిదవ శతాబ్దపు మొదటి అర్ధంలో, మన దేశంలో ఒక వైపు దేశీయ రాజ్యాలు స్వదేశీ షావుకార్లతోనూ, మరోవైపు ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వంతోనూ ఆర్థిక లావాదేవీలు జరుపుతూ ఉండేవి, ఆ కాలంలో సాలుకు 48 శాతం వడ్డీ రేటు చెలామణిలో ఉండేది. 1914-18లో జరిగిన మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో అప్పటి భారత (ఆంగ్ల) ప్రభుత్వం సాలుకు 61/2 శాతం వడ్డీ చొప్పున యుద్ధ రుణాలు సేకరించింది. 1920 నుండి 1930 మధ్యకాలంలో కో ఆపరేటివ్ సొసైటీల్లో సాధారణ వడ్డీ రేటు 12 నుండి 15 శాతం వరకూ ఉండేది. 1930 నుండి 1940 మధ్య కాలంలో దేశీయ న్యాయస్థానాలు సాలీనా 9 శాతం వడ్డీ రేటును సముచితము, సక్రమమైనవని తీర్పునిచ్చేవి. రెండవ ప్రపంచ యుద్ధానికి సమీప కాలంలో రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా డిస్కౌంట్ రేటును సంవత్సరానికి 3 శాతం చొప్పున నిర్ణయిం చింది. ఇదే రేటు యుద్ధ కాలంలో కూడా అమలులో ఉంది. ఇంకా 2.75 శాతం వడ్డీ రేటుపై అప్పటి భారత ప్రభుత్వానికి కూడా అప్పులు లభించేవి.

ఇదైతే మన ఉపఖండానికి సంబంధించిన పరిస్థితి. అటు యూరప్‌పై దృష్టి సారిస్తే అక్కడ కూడా మీకు ఇదే చిత్రం కనిపిస్తుంటుంది. పదహారవ శతాబ్దపు మధ్య భాగంలో ఇంగ్లాండ్‌లో 10 శాతం వడ్డీ రేటును అత్యంత సక్రమమైనదిగా, సముచితమైనదిగా పేర్కొనడం జరిగింది. 1920 సమీప కాలంలో యూరప్‌లోని కొన్ని కేంద్రీయ బ్యాంకులు (Central Banks) ఎనిమిది లేక తొమ్మిది శాతం చొప్పున రేటును నిర్ణయించేవి. స్వయంగా నానా జాతి సమితి (League of Nations) తన మధ్యవర్తిత్వంతో యూరప్‌లోని కొన్ని రాజ్యాలకు అప్పట్లో ఇప్పించిన రుణాలకు కూడా దాదాపుగా ఇదే శాతం

వడ్డీ ఉండేది. అయితే నేడు ఎవరైనా యూరప్ లేక అమెరికా ముందు ఈ శాతం ఊసెత్తుతే వారు మండిపడతారు. ఇది వడ్డీ కాదు, దోపిడీ అని గర్జిస్తారు. ఇప్పుడు ఎటు చూసినా 2 1/2 లేక 3 శాతం రేటే వినిపిస్తున్నది. 4 శాతం అంటే అత్యధిక రేటు అనబడుతుంది. కొన్ని సందర్భాల్లోనైతే 1 శాతం, 1/2 శాతం, 1/4 శాతం వరకు కూడా వడ్డీ రేటు పడిపోతుంది. కాని వేరొక వైపు పేద ప్రజలకు వడ్డీతో కూడిన అప్పులు సమకూర్చే షావుకార్ల కోసం ఇంగ్లాండ్‌లో 1920లో మనీలాండర్స్ ఆక్టు పేరుతో ఒక చట్టాన్ని రూపొందించడం జరిగింది. అందులో సంవత్సరానికి 48 శాతం వడ్డీ రేటును సమ్మతింపదగినదిగా, సక్రమమైనదిగా నిర్ణయించారు. ఇక అమెరికాలోని న్యాయస్థానాలు వడ్డీపై అప్పిచ్చే మహాజన్‌లకు (మనీలాండర్స్‌కు) సంవత్సరానికి 30 శాతం నుండి 60 శాతం వరకు వడ్డీ ఇప్పిస్తున్నాయి. ఇక చెప్పండి, పై వాటిలో దేన్ని స్వాభావికమైన, లేక సక్రమమైన, సముచితమైన వడ్డీ రేటుగా పేర్కొనడం సబబుగా ఉంటుంది?

నిజానికి ఏ వడ్డీ రేటు అయినా స్వాభావికమైనదిగా, సముచితమైనదిగా ఉంటుందా? అనే సమస్య గురించి పరిశీలించవలసి ఉంది. ఈ ప్రశ్నపై ఆలోచించినప్పుడు మీ బుద్ధిజ్ఞానాలు స్వయంగా మీకు తెలిపేదేమంటే, ఒక వ్యక్తి, తాను తీసుకున్న అప్పుతో ఇంత లాభాన్ని గడించగలడని నిశ్చితమైనప్పుడే దానిపై ఇంత శాతం వడ్డీ 'సముచితం'గా ఉంటుందనేది నిర్ణయమవుతుంది. ఉదాహరణకు, ఒక వ్యక్తి తీసుకున్న వంద రూపాయల అప్పుతో ఒక సంవత్సరంలో 25 రూపాయల విలువ గలిగిన లాభాన్ని ఆర్జిస్తాడని ఖచ్చితంగా తెలిసినప్పుడే, ఈ లాభం నుండి ఇంత శాతం మనిషి యొక్క స్వాభావిక మరియు సక్రమమైన భాగం అని నిర్ణయించడానికి వీలవుతుంది. కాని వినియోగింపబడిన ఈ పెట్టుబడి ఎంత లాభాన్నిస్తుందనేది నిర్ధారించబడనూ లేదు, అలా సాధ్యమూ కాదు. మార్కెట్‌లోని వడ్డీ రేటును నిర్ణయించేటప్పుడు

అప్పు తీసుకున్న వ్యక్తికి దీంతో ఎంత లాభం వస్తుందనేది అసలు పరిగణనలోకే తీసుకోరు. అంతేకాదు, అసలు దీనివల్ల లాభం వస్తుందా? రాదా? అనేది కూడా ఎవరూ ఆలోచించరు. క్రియాత్మకంగా వడ్డీ వ్యాపారంలో జరిగేదేమిటంటే అప్పు అడిగే వాని అగత్యం, అవసరాన్ని బట్టి వడ్డీ రేటు నిర్ణయించబడుతుంది. ఇక వాణిజ్యపరమైన వడ్డీ వ్యాపారంలో వడ్డీ రేటు మార్కెట్ వైపరీత్యాలతో, ఉచితానుచితాలతో దూరపు సంబంధం కూడా లేకుండా ఇతరత్రా అంశాల ఆధారంగా నిర్ణయించబడుతుంది.

## వడ్డీ రేట్లు మారడానికి కారణాలు

వడ్డీ వ్యాపారంలో ఒక వ్యాపారి సామాన్యంగా చూసేదేమంటే తన వద్దకు అప్పు కోసం వచ్చిన వ్యక్తి ఎంత పేదవాడు, ఎంత అవసరార్థుడు, ఎంతగా దిక్కుతోచని స్థితిలో ఉన్నాడు? ఇంకా అప్పు దొరక్కపోతే అతనింకెన్ని కష్టాల్ని ఎదుర్కోవలసి వస్తుంది? లాంటి విషయాల్ని పరిగణనలోకి తీసుకునే అతని నుండి తానెంత వడ్డీని అడగాలో అతను అంచనా వేసుకుంటాడు. అతను తక్కువ పేదవాడు, తక్కువ అగత్యపరుడు, చిన్నమొత్తంలోనే అడుగు తున్నాడు, ఎక్కువ కష్టాల్లో లేడు అనుకోండి – అలాంటప్పుడు వడ్డీ రేటు తక్కువ గానే నిర్ణయించబడుతుంది. దీనికి భిన్నంగా అతను కటిక దరిద్రుడు, అత్యంత అవసరార్థి అయి ఉంటే, అప్పు దొరక్కపోతే తీవ్ర పరిణామాల్ని ఎదుర్కోబోతు న్నాడని తెలిస్తే వడ్డీ కూడా అదే విధంగా వడ్డించబడుతుంది. ఒకవేళ ఎవరైనా ఒక కటిక దరిద్రుని కుమారుడు తీవ్ర అస్వస్థతకు గురిఅయి, ప్రాణాపాయ స్థితికి చేరుకుని ఉంటే అలాంటి వ్యక్తి విషయంలో నాలుగైదు వందల శాతం వడ్డీ రేటు కూడా "అసమంజసం" ఏమీ కాదు. ఇలాంటి పరిస్థితుల్లో "స్వాభావిక" వడ్డీ రేటు దాదాపుగా అదే ప్రమాణాన్ని పోలి ఉంటుంది. 1947లో ప్రళయాన్ని తలపించే బీభత్స వాతావరణంలో "అమృత్‌సర్"

స్టేషన్‌లో ఒక సిఖ్ఖు ఒక గ్లాసెడు మంచి నీళ్ళ "స్వాభావిక" ధర 300 రూపాయలు నిర్ణయించి) ఒక ముస్లింకు అమ్మాడు. ఎందుకంటే అతని అబ్బాయి దాహాన్ని తాళలేక ప్రాణాపాయ స్థితికి చేరుకున్నాడు, అప్పట్లో ఇంకా కాందిశీకుల ట్రైను నుండి ఏ ఒక్క ముస్లిం క్రిందికి దిగి స్వయంగా నీరు తీసుకునే పరిస్థితి లేదు.

ఇక రెండవ కోవకు చెందిన ఆర్థిక అంగళ్ళలో వడ్డీ రేట్ల నిర్ణయం, దాని ఎగుడు దిగుళ్ళు ఏ ప్రాతిపదికన జరుగుతాయో, వీటికి సంబంధించి ఆర్థిక నిపుణుల్లో రెండు దృక్పథాలున్నాయి:

డిమాండు మరియు సప్లయి చట్టం దీనికి ప్రాతిపదికయై ఉంటుందని ఒక వర్గం వారంటారు. పెట్టుబడి స్వీకరించే వారు తక్కువై, అప్పు ఇవ్వగలిగే డబ్బు అధికమైనప్పుడు, వడ్డీ రేటు పడిపోవడం ప్రారంభిస్తుంది. ఇక ఎప్పుడైతే ఈ రేటు బాగా పడిపోతుందో అప్పుడు దీన్ని సదవకాశంగా గుర్తించి వ్యాపారాల్లో వినియోగించవచ్చని, అప్పులు తీసుకోవడానికి వ్యాపారులు ఎగబడతారు. ఇక డబ్బు డిమాండు పెరిగిపోయి, ఇంకా అప్పు ఇవ్వగలిగే ధనం తక్కువైపోయినపుడు ఈ వడ్డీ రేట్లు పెరగనారంభిస్తాయి. చివరికి అదెంత గరిష్ట స్థాయికి చేరుకుంటుందంటే, అప్పు కోరిక (డిమాండు) తగ్గిపోతుంది.

దీని అర్థమేమిటో కాస్త మీరే ఆలోచించి చూడండి. పెట్టుబడిదారు నేరుగా, సజావుగా వర్తకునితో పొత్తు వ్యవహారాన్ని కుదుర్చుకుని న్యాయప్రదంగా, వాస్తవంగా అతనికొచ్చిన లాభంలో నుంచి తన వాటాను నిర్ణయించుకోడు. దానికి బదులు ఫలానా వ్యాపారంలో అతనికి కనీసం ఇంత లాభం రావచ్చని ముందస్తు అంచనా వేసుకుని, తానిస్తున్న అప్పుపై తనకింత వడ్డీ వచ్చి తీరాలని కోరుకుంటాడు. అవతలి వైపు వర్తకుడు కూడా తాను అప్పుగా తీసుకున్న డబ్బుతో తనకు గరిష్టంగా ఇంత లాభం రావచ్చని అంచనా వేసుకొని అంతకు మించిన వడ్డీ రేటు ఉండకూడదని కోరుకుంటాడు. ఇద్దరూ

కూడా ఒక ఊహ, అంచనా (Speculation)లతోనే వ్యవహారం నడుపుకుం టున్నారు. పెట్టుబడిదారు ఎప్పుడూ లాభాన్ని గరిష్టంగా (ఎక్కువకు ఎక్కువ) నే అంచనా వేస్తాడు, అదే సమయంలో వర్తకుని దృష్టి లాభాలతో పాటు, నష్టాల ప్రమాదంపై కూడా ఉంటుంది. ఈ కారణంగా ఈ ఇద్దరి మధ్య పరస్పరం సహకార భావానికి బదులు ఎడతెగని ఘర్షణా వైఖరి చోటు చేసుకుంటూ ఉంటుంది. ఒక వ్యాపారవేత్త లాభాపేక్షతో వ్యాపారంలో పెట్టుబడిని పెట్టినప్పుడు, పెట్టుబడిదారు తన పెట్టుబడి విలువను పెంచుతూ పోతాడు. చివరికది ఎంతగా పెంచుతాడంటే, అంత అత్యధిక రేటుతో పెట్టుబడిని స్వీకరించి వ్యాపారంలో వినియోగించడం ఎంత మాత్రం లాభదాయకంగా ఉండజాలదు. ఈ విధంగా పెట్టుబడి లేక డబ్బు వ్యాపారాల్లో వినిమయ మవటం ఆగి పోతుంది. తత్ఫలితంగా ఆర్థికాభివృద్ధి అమాంతంగా ఆగి పోతుంది. ఆర్థిక మాంద్యం వాణిజ్య రంగమంతటిపై తన తీవ్ర ప్రభావం వేయగానే పెట్టుబడిదారు కూడా కలవరం చెందుతాడు. తన ఉనికి ప్రమా దంలో ఉందని గ్రహించగానే ఎకాఎకి తన వడ్డీ రేటును బాగా తగ్గించేస్తాడు. వ్యాపారవేత్తలకు ఈ వడ్డీ రేటుపై అప్పులు తీసుకొని వ్యాపారంలో వెచ్చిస్తే లాభాలు వచ్చే ఆశలు పుడతాయి. ఆ విధంగా వ్యాపార పారిశ్రామిక రంగాల్లో తిరిగి పెట్టుబడుల ప్రవాహం మొదలవుతుంది. దీనివల్ల అర్థమవుతున్నదేమిటి? వ్యాపారం మరియు పెట్టుబడుల మధ్య భాగస్వామ్యపు పద్ధతిలో సహాయ సహకారాలే ఉండి ఉంటే ప్రపంచ ఆర్థిక వ్యవహారాలు సాఫీగా, సరళంగా ఎలాంటి ఒడుదుడుకులు లేకుండా సాగిపోయేవి. కాని చట్టం పెట్టుబడిదారుకు వడ్డీపై డబ్బిచ్చే ద్వారాలు తెరవటంతో పెట్టుబడి మరియు వ్యాపార పరస్పర సంబంధాల్లో జూదరి మనస్తత్వం ప్రాకిపోయింది. తద్వారా జూదమాడినట్లే వడ్డీ రేట్లు పెరగతరగసాగాయి. దీని ఫలితంగా ప్రపంచమంతటా ఆర్థిక

రంగంలో ఒక నిరంతర సంక్షోభ వాతావరణం అలుముకుంది. సంక్షోభాన్ని, అవ్యవస్థను ఎదుర్కోవలసి వస్తున్నది.

ఇక రెండో వర్గం వడ్డీ రేటుకు సంబంధించిన కారణాన్ని ఇలా విశ్లేషి స్తుంది: పెట్టుబడిదారు డబ్బును తన స్వంత వినియోగం కోసం ఉంచడానికి ఇష్టపడినప్పుడు అతను వడ్డీ రేటును పెంచేస్తాడు. అతని ఈ కోరిక తగ్గిపోయి నపుడు వడ్డీ రేటు కూడా తరిగిపోతోంది. పెట్టుబడిదారు నగదు సొమ్మును తన వద్దనే ఉంచుకోవడానికి ఎందుకు ప్రాధాన్యతనిస్తాడనేది కూడా ఒక ప్రశ్నే. దానికి ఈ వర్గం వారు ఇచ్చే సమాధానం ఏమిటంటే; దీనికి ఎన్నో కారణాలు న్నాయి. ఎంతో కొంత డబ్బు తన స్వంత లేక వ్యాపార అవసరాల కోసం ఉంచుకోవడం అనివార్యమవుతుంది. అనుకోకుండా వచ్చే అవాంతరాలు, అకస్మాత్తుగా వచ్చిపడే అవసరాల కోసం కూడా ఎంతో కొంత దాచి పెట్టాల్సి వస్తుంది. ఉదాహరణకు, తన స్వంత వ్యవహారంలో ఏదో అసాధారణ ఖర్చు లేక ఒక మంచి వ్యాపారం అకస్మాత్తుగా ముందుకు రావడం - ఈ రెండు కారణాలే కాకుండా ఒక మూడవ, అత్యంత ముఖ్య కారణం కూడా ఉంది. భవిష్యత్తులో ధరలు బాగా పడిపోయినప్పుడు లేక వడ్డీ రేటు పెరిగిపోయి నప్పుడు దీని ద్వారా లబ్ధి పొందడానికి తన వద్ద తగినంత నగదు సొమ్ము ఉండాలని కూడా పెట్టుబడిదారు కోరుకుంటాడు. పై కారణాల వల్ల డబ్బును తన ఉపయోగం కోసం ఉంచుకోవాలని పెట్టుబడిదారు మనస్సులో జనించే ఈ కోరిక పెరుగుతూ, తరుగుతూ ఉంటుందా? అనేది ప్రశ్న. ఇంకా దీని ప్రభావం వడ్డీ రేట్ల ఎగుడుదిగుళ్ళ రూపంలో పొడసూపుతుందా? దీనికి వారిచ్చే సమాధానమేమిటంటే అవును, వివిధ వ్యక్తిగత, సామూహిక, రాజకీయ, ఆర్థిక కారణాల దృష్ట్యా ఈ కోరిక పెరిగిపోతుంది. దాంతో పెట్టు బడిదారు వడ్డీ రేటును పెంచేస్తాడు. అలాగే ఒక్కోసారి వ్యాపారాల వైపు పెట్టు బడులు రావడం తగ్గిపోతుంది. ఒక్కొక్కసారి అతని ఈ కోరిక తగ్గిపోతుంది. అందుకని పెట్టుబడిదారు వడ్డీ రేటును తగ్గించేస్తాడు. అలా తగ్గిపోయిన కారణంగా

ప్రజలు వ్యాపారం, పరిశ్రమల్లో వినియోగించడానికి అధిక మొత్తాల్లో అప్పులు తీసుకోవడం మొదలెడతారు.

అందమైన పై విశ్లేషణ ముసుగులో దాగి ఉన్న విషయమేమిటో కాస్త పరిశీలించి చూడండి. వ్యక్తిగత అవసరాల కోసమో, స్వంత వ్యాపార వ్యవహారాల కోసమో పెట్టుబడిదారు తన అత్యధిక ధనాన్ని ఆపి ఉంచుకుంటాడనేది అర్థంకాని విషయం. వ్యక్తిగత అవసరాలు, స్వంత వ్యాపార వ్యవహారాలకు అతని వద్దనున్న పెట్టుబడుల్లో ఎక్కువకు ఎక్కువ 5 శాతం సరిపోతుంది. అందుకని పైన చూపిన మూడు కారణాల్లో నుండి మొదటి రెండు కారణాలకు అనవసర ప్రాధాన్యతనివ్వడం ఎంతమాత్రం సమంజసం కాదు. తన వద్దనున్న పెట్టుబడుల్లోని 95 శాతం, దేన్నయితే కొన్ని సందర్భాల్లో ఆపేసుకుంటాడో, మరికొన్ని సందర్భాల్లో అప్పుల రూపంలో మార్కెట్టులో ప్రవహింపజేస్తాడో, దానికి ప్రధాన కారణం మూడవదే. అంటే భవిష్యత్తులో ఎప్పుడైనా బాగా ధరలు పడిపోయినప్పుడు లేక వడ్డీ రేట్లు అత్యధికంగా పెరిగిపోయినపుడు ఈ అవకాశంతో లాభపడడానికి తనవద్ద తగినంత నగదు సొమ్ము ఉండాలనేది. ఇంకా ఈ కారణాన్ని విశ్లేషించి చూసినట్లయితే బండారం బయటపడుతుంది. పెట్టుబడిదారు అత్యంత స్వార్థబుద్ధితో ప్రపంచ పరిస్థితుల్ని, స్వయంగా తన దేశ, జాతి పరిస్థితుల్ని గుంటనక్కలా పసిగడుతూ ఉంటాడు. కొన్ని కొన్ని సందర్భాల్లో అతను అసాధారణ పరిస్థితుల్ని, సూచనల్ని, సంక్షోభాలను గమనిస్తూ ఆ గడ్డుకాలం దాపురించినప్పుడు సమాజ కష్టనష్టాలను సొమ్ము చేసుకోవటానికి ప్రయత్నిస్తాడు. అక్రమంగా తన ధనాగారాన్ని నింపుకోవాలని, దానికి ఉపకరించే ఆయుధం అనగా పెట్టుబడులు తన వద్ద ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండాలని కోరుకుంటాడు. అందుకనే అతను సట్టా వ్యవహారం కోసం ధనాన్ని, పెట్టుబడుల్ని తన వద్దనే ఆపుకుంటాడు. వడ్డీ రేటును పెంచేస్తాడు. పరిశ్రమలు, వాణిజ్యం వైపు తన పెట్టుబడుల్ని పోకుండా ఒకేసారి ఆపేస్తాడు.

తత్ఫలితంగా సమాజంపై మహమ్మారి అనబడే వ్యాపార, ఆర్థిక మాంద్యపు ద్వారాలను తెరిచేస్తాడు. ఈ మార్గం ద్వారా పాపిష్టి సొమ్మును ఎంతగా దండు కోవాలో అంతగానూ దండుకున్న తరువాత, ఇక ముందు లాభాలకు ఇక అవకాశాలు లేనేలేవని, పరిస్థితి ఇలాగే ఉంటే అసలుకే నష్టమని తెలిసి పోయి నప్పుడు పెట్టుబడుల్ని తన స్వంత ఉపయోగం కోసం ఉంచుకోవాలనే కోరిక అతని దురాత్మలో తగ్గిపోతుంది. అప్పుడతను తక్కువ వడ్డీ రేటు ఆశ చూపించి "నా వద్ద బోలెడన్ని పెట్టుబడులున్నాయి. తక్కువ రేటుకే కావలసినన్ని పెట్టుబడులు పొందండ"ంటూ వాణిజ్య, పారిశ్రామికవేత్తల్ని, వ్యాపారుల్ని పురిగొల్పుతాడు.

వడ్డీ రేటుకు సంబంధించి ఆధునిక ఆర్థికవేత్తలు ఈ రెండు కారణాలనే పేర్కొనగలిగారు. తమ దృష్టి కోణంలో అవి రెండూ కూడా వాస్తవాలే. ఈ రెండింటిలో ఏ ఒక్క కారణమైనప్పటికీ దీని ద్వారా ఒక "సక్రమమైన" మరియు "సహజ (స్వాభావిక)మైన "వడ్డీ" రేటు నిర్ణయించబడడం ఎలా సాధ్యం అనేది ప్రశ్న. బుద్ధీవివేకాలు, సమంజసత్వం లాంటి వాటికి అర్థాలనైనా మనం మార్చుకోవాలి, లేదనుకుంటే వడ్డీ ఎంత ముదనష్టపు వస్తువో దాని రేటు కూడా అంతే దరిద్రమైనదని అంగీకరించాలి.

## వడ్డీ యొక్క 'ఆర్థిక లాభాలు' దాని 'అవసరం'

దీని తరువాత, వడ్డీ ఒక ఆర్థిక అవసరమని ఇది లేకుండా కొన్ని లాభాలు సాధ్యపడవని వడ్డీ సమర్థకులు చర్చను మొదలుపెడతారు. ఈ వాదనను సమర్థించుకోవడానికి వారే దృష్టాంతాలు ఇస్తారో వాటి సారాంశం ఇలా ఉంటుంది:

1. మానవ ఆర్థిక వ్యవహారాలన్నీ పెట్టుబడులు సమకూరడంపైనే ఆధారపడి ఉంటాయి. ప్రజలు తమ అవసరాలు, కోరికల్ని కొంత వరకు కట్టడి

చేసుకోకపోతే ధనం ప్రోగవడం సంభవం కాదు. ప్రజలు తమ సంపాదన నంతటినీ తమపైనే ఖర్చు చేసుకోకుండా కొంతలో కొంతన్నా ఆదా చేస్తూ ఉండాలి. ధనం ప్రోగవడానికి ఇదొక్కటే మార్గం. ఒక మనిషి ఆత్మ నిగ్రహానికీ, త్యాగానికి ఏదైనా ప్రతిఫలం లభించకపోతే అతనెందుకు తన కోరికల్ని చంపుకోవడానికి, పొదుపు చేయడానికి ఇష్టపడతాడు? వడ్డీ రూపంలో లభించే ప్రతిఫలమే ప్రజల్ని పొదుపుకు ప్రేరేపిస్తుంది. మీరొకవేళ దీన్ని నిషేధించినట్లయితే, పెట్టుబడులకు జీవనాడి అయిన 'పొదుపు' స్తంభించిపోతుంది.

2. ఆర్థిక కార్యకలాపాల వైపు ధన (పెట్టుబడుల) ప్రవాహం సరళంగా వచ్చే పద్ధతి ఏమిటంటే, ప్రజలకు వారు పొదుపు చేసుకున్న ధనాన్ని వడ్డీపై ఇచ్చుకునే అవకాశం ఉండాలి. ఈ విధంగా వడ్డీ దొరుకుతుందనే ఆశే వారి తరఫున ధనాన్ని ఆదా చేయిస్తుంది. వడ్డీ ఆశే వారిని తాము పొదుపు చేసిన ధనాన్ని ఊరికే ఉండనియ్యకుండా వ్యాపారవేత్తలకు అప్పగించి ఒక నిర్దిష్ట పరిమాణంలో వడ్డీని వసూలు చేసుకుంటూ ఉండడానికి పురిగొల్పుతుంది. ఈ వడ్డీనే గనక మీరు నిషేధించినట్లయితే డబ్బును పొదుపు చేసే ఒక ముఖ్య ఆధారం కనుమరుగవడమే కాకుండా కొద్దో గొప్పో జమ అయిన ధనం కూడా వాణిజ్య కార్యకలాపాల్లో ఉపయోగపడకుండా ఊరికే పడి ఉంటుంది.

3. వడ్డీ అనేది ధనాన్ని ప్రోగుచేయడం, దాన్ని వ్యాపార కార్యకలాపాల వైపు నెట్టుకు రావడమొక్కటే చేయదు, అది దాని అనుచిత ఉపయోగాన్ని కూడా అరికడుతుంది. ఇక వడ్డీ రేటుకు సంబంధించి – వ్యాపారానికి సంబంధించిన వివిధ సాధ్యపడే రంగాల్లో నుండి అత్యధిక లాభదాయక రంగం వైపునకు ధనాన్ని (పెట్టుబడుల్ని) తరలించడానికి ఈ వడ్డీ రేటే తనంతట తానుగా శ్రేయస్కరమైన పద్ధతిలో ఏర్పాట్లు చేస్తూ ఉంటుంది. ఆచరణకు సాధ్యపడే వివిధ రంగాల్లో నుండి లాభదాయకమైనదాన్ని నష్టదాయకం నుండి, తక్కువ

లాభమిచ్చే దాన్నుండి ఎక్కువ లాభమిచ్చే దాన్ని గుర్తించి, విడదీసి, ఇంకా లాభం వైపు ధన ప్రవాహాన్ని మరలించగలిగే ఉపాయం ఇది కాకుండా ఇంకేదీ మన బుద్ధికి తట్టదు. ఇక మీరే గనక వడ్డీని నిర్మూలిస్తే ప్రజలు విచ్చలవిడిగా తమ ధనాన్ని వినియోగిస్తారు. ఇంకా లాభనష్టాల్ని అంచనా వేయకుండానే అపసవ్యమైన, తలా తోక లేని కార్యకలాపాల్లో దాన్ని వినియోగించ నారంభిస్తారు.

4. అప్పు అనేది మానవ జీవితంలోని ఒక అనివార్యమైన అవసరం. ప్రజలకు కూడా తమ వ్యక్తిగత వ్యవహారాల్లో దీని అవసరం పడుతూ ఉంటుంది. అదే విధంగా వ్యాపారులకు కూడా ప్రతినిత్యం దీని అవసరం ఉండనే ఉంది. ఇంకా ప్రభుత్వ వ్యవహారాలు కూడా ఇది లేకుండా నడవ జాలవు. ఇంత ముమ్మరంగా, ఇంతపెద్ద స్థాయిలో అప్పుల అందుబాటు కేవలం దాన ప్రాతిపదికగా ఎంత వరకు సాధ్యమవుతుంది? ఎవరి దగ్గరైతే ధన ముందో, వారికి వడ్డీ ఆశ చూపి, అసలుతోపాటు వడ్డీ కూడా మీకు ముదు తుందని నమ్మకం కలిగించకపోతే, వారసలు అప్పులివ్వడానికి సిద్ధంకారు. ఈ విధంగా అప్పుల అందుబాటు ఆగిపోయిన కారణంగా దీని తీవ్ర చెడు ప్రభావం పూర్తి ఆర్థిక జీవనాన్ని స్థంభింపజేస్తుంది. ఒక పేదవానికి తన కష్టకాలంలో వడ్డీ వ్యాపారితో అప్పు అయినా పుడుతుంది. వడ్డీ ఆశే లేకపోయి నట్లయితే, ఆ దరిద్రుని ఇంట్లోని శవం ఎవరూ సహాయమందించే వారు లేక అంత్యక్రియ లకు కూడా నోచుకోదే! ఒక వ్యాపారికి అతని కష్టకాలంలో వడ్డీతో కూడిన అప్పు వెంటనే లభిస్తుంది. ఆ విధంగా అతని కార్యకలాపాలు యధావిధిగా కొనసాగుతాయి. ఈ ద్వారమే గనక మూసివేసినట్లయితే, అతనెన్నిమార్లు 'దివాలా' తీసేవాడో ఎవరికి తెలుసు? ప్రభుత్వ వ్యవహారాలు కూడా ఇలాగే నడుస్తుంటాయి. వడ్డీతో కూడిన అప్పులతోనే అవి తమ

అవసరాలు వెళ్ళదీసు కుంటాయి. అలా కాదనుకుంటే కోట్లకు కోట్లు సమకూర్చే ధర్మదాతలు ప్రతిరోజు వారికి ఎక్కడ దొరుకుతారని?

## వడ్డీ అనేది నిజంగానే అవసరమైనదా? అది లాభ దాయకమైనదా?

ఇక రండి, ఈ వడ్డీలోని ఒక్కొక్క 'లాభాన్ని' 'అవసరాన్ని' విశ్లేషించి చూద్దాం. నిజంగానే ఈ వడ్డీ అనేది ఏదైనా లాభం కలిగించే వస్తువా? అది అవసరమైన విషయమేనా? లేక ఇదంతా కేవలం షైతాన్ రేపిన ఒక దుర్బోధ, దుష్టప్రేరణ మాత్రమేనా అనేది పరిశీలించాల్సి ఉంది.

ఆర్థిక జీవనం కోసం ప్రజల పొదుపు గుణాన్ని, ధనాన్ని కూడబెట్టడాన్ని అవసరమైనదిగా, సముచితమైనదిగా భావించడమే ప్రాథమిక పొరపాటు. నిజానికి వ్యవహారం దీనికి భిన్నంగా ఉంది. సమాజం సామూహిక రూపంలో ఉత్పత్తి చేసిన జీవితావసర వస్తువులు తొందర, తొందరగా అమ్ముడవుతూ పోవాలి. అప్పుడే ఉత్పత్తి మరియు దాని వినిమయపు చక్రం సమతౌల్యంలో ఉండి, సజావుగా నడుస్తూ పోతుంది. ఇది ఎప్పుడు సంభవం కాగలుతుంది? ప్రజలు సామాన్యంగా ఆర్థిక కార్యకలాపాల ద్వారా సంపాదించిన డబ్బును, విశాల హృదయంతో ఖర్చు చేసినప్పుడే! ఇంకా ప్రజల్లో ఎంత హృదయ విశాలత్వం ఉండి ఉండాలంటే, వారి అవసరాలకు మించిన ధనం వారి వద్దకు వచ్చినప్పుడు, సమాజంలోని అదృష్టహీనులైన తమ సోదరులు కూడా తమకవ సరమైనన్ని జీవితావసర వస్తువులు కొనుక్కోవడానికి వారిని ఆదుకోవాలి. దీనికి భిన్నంగా మీరు వారికి నేర్పుతున్నదేమిటి? ఎవరి వద్దకైతే వారి అవసరాలకు మించి ధనం వచ్చిందో వారు కూడా పిసినారితనం చూపి (దీన్నే మీరు ఆత్మ నిగ్రహం, ధర్మనిష్ఠ, త్యాగం మున్నగు పదాలతో వర్ణిస్తున్నారు) తమ సముచిత

అవసరాల్లో నుండి కూడా ఒక చెప్పుకోదగ్గ భాగాన్ని వదులుకోవాలని, ఇంకా ఈ విధంగా ప్రతి మనిషి సాధ్యమైనంతగా ధనాన్ని కూడబెట్టాలని నూరిపోస్తు న్నారు. మీ దృష్టిలో దీనితో ఒనగూరే లాభమేమిటంటే, ఈ రకంగా ధన సేకరణ జరిగి, అది పరిశ్రమ, వ్యాపార రంగాల అభివృద్ధికి దోహదపడు తుంది. కాని వాస్తవంగా పరిశీలించి చూసినట్లయితే ప్రస్తుతం మార్కెట్టులో ఏ సరుకులైతే ఉన్నాయో వాటిలోని ఒక పెద్ద భాగం నిరుపయోగంగా పడి ఉండి నష్టానికి దారి తీస్తుంది. ప్రజల్లో ఎవరి వద్దనయితే కొనే శక్తి, స్థోమత లేదో వారైతే లేమి కారణంగా అత్యధిక సరుకుల్ని కొనలేకపోయారు. ఇక ఎవరైతే తమ అవసరాలకు సరిపడా సరుకులు కొనగలిగి ఉన్నారో వారు స్థోమత ఉండి కూడా ఉత్పత్తి అయిన సరుకుల్లో నుండి ఒక పెద్ద భాగాన్ని కొనకుండా వదిలేశారు. ఇక ఎవరి వద్దనైతే వారి అవసరాలకు మించి కొనగలిగే శక్తి (అంటే ధనం) ప్రోగైందో, వారు దాన్ని ఇతరులకు పంపిణీ చేయడానికి బదులు తమ వద్దనే ఆపి ఉంచుకున్నారు. ఇకిప్పుడు ఒకవేళ ప్రతి ఆర్థిక పరిభ్రమణంతో అవసరాలకు సరిపడా సరుకులు కొనగలిగే, అవసరా లకు మించి కొనగలిగే అర్హత పొందిన వారు తమ ఈ (కొనుగోలు) శక్తిని ఉత్పత్తి అయిన సరుకుల్ని కొనడంలోనూ ఉపయోగించడంలేదు, కొనే అర్హత లేని వారి వైపునకు కూడా ఈ శక్తిని (ధనాన్ని) పంపిణీ చేయడం లేదు. దానికి బదులు ఈ శక్తిని (ధనాన్ని) ఆపుతూ, కూడబెడుతూ పోతున్నారు. అలాంట ప్పుడు దీని ఫలితం ఎలా వస్తుంది? ఉత్పత్తి అయిన సరుకుల్లోని ఒక చెప్పుకో దగ్గ భాగం ప్రతిసారీ అమ్ముడు పోకుండా ఆగిపోతూ ఉంటుంది. తత్కారణంగా ఉత్పత్తుల్ని తగ్గించాల్సి వస్తుంది. ఉత్పత్తుల్ని తగ్గించదలిచినప్పుడు నిరుద్యోగ సమస్య తలెత్తుతుంది. నిరుద్యోగం ప్రబలి పోయినప్పుడు ప్రజల ఆదాయాలకు గండిపడుతుంది. ప్రజలకు ఆదాయాలే లేనప్పుడు వారు జీవితావసరాల వస్తువులు ఎలా కొనగలుగుతారు? ఉత్పత్తి అయిన సరుకుల్లో నుండి ఒక

చెప్పుకోదగ్గ భాగం ముందే అమ్ముడుపోక వృధాగా పడి ఉందే! దీంతో పరిస్థితి ఇంకా దిగజారుతుంది. సరిపడా ఆదాయాలే లేనప్పుడు, ప్రజల్లో కొనే స్థోమతే లేనప్పుడు వ్యాపార సరుకుల వినియోగంలో మాంద్యం ఏర్పడదా? ఈ విధంగా కేవలం కొందరి ధన కేంద్రీకరణ (అంటే జమచేసే, కూడబెట్టే మనస్తత్వం) అనేక మంది దారిద్ర్యానికి కారణమవుతుంది. చివరికి ఈ కూడబెట్టే గుణం స్వయంగా వారికే నష్టదాయకంగా పరిణమిస్తుంది. అదెలాగంటే ఏ ధనాన్న యితే వారు కొనుగోలులో వెచ్చించక కూడబెట్టి జమ చేసి, ఇంకా సరుకుల ఉత్పత్తికి వెచ్చిస్తూ పోతారో దాని ద్వారా ఉత్పత్తి అయిన సరుకుల్ని అసలు కొనేవారే ఉండరు.

ఈ వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకొని ఆలోచించినప్పుడు, ఏ ప్రజలైతే తమ ఆదాయాన్ని ఖర్చుపెట్టడానికి బదులు నిలిపి ఉంచే, కూడబెట్టే వైపునకు ఆకర్షితులవుతున్నారో, ఆ కారణాలను ప్రేరేపణలను దూరం చేయడానికి ప్రయత్నించడమే అసలు తరుణోపాయమని అర్థమైపోతుంది. యావత్ సమాజం శ్రేయో సాఫల్యం దృష్ట్యా ప్రజలు తమ ఆదాయాన్ని గడ్డుకాలంలో, కష్టకాలంలో సామూహికంగా ప్రతి వ్యక్తికి ఎలాటి ఆటంకం లేకుండా ఆర్థిక సహాయం లభించే కట్టుదిట్టమైన ఏర్పాట్లు ఒకవైపు జరిగితే, వేరొక వైపు ప్రజల్లో కూడబెట్టే గుణాన్ని తగ్గించడానికి వారి ధనంపై జకాతు విధించాలి. అంతేకాకుండా ఆర్థిక కార్యకలాపాల్లో పాల్గొన్నప్పటికీ ఎవరికైతే సముచిత భాగం లభించలేదో అలాంటి వారికి అలా జమ అయిన ధనం నుండి కొంత భాగం తప్పకుండా చేరుతూ ఉండాలి. కాని దీనికి భిన్నంగా మీరు అతనికి వడ్డీ ఆశ చూపిస్తూ, ప్రజల నైజంలోనే దాగి వున్న పిసినారితనాన్ని, స్వార్థ ప్రియత్వాన్ని ఇంకా ప్రేరేపిస్తున్నారు. ఇక ఎవరయితే పిసినారులు కారో, వారికి కూడా ఖర్చుపెట్టడానికి బదులు జమ చేయండని నేర్పిస్తున్నారు.

ఈ విధంగా అక్రమ మార్గంలో సామూహిక ప్రయోజనానికి విరుద్ధంగా ఏ ఏ ధనమైతే ప్రోగవుతుందో, ఆ ధనాన్ని కూడా ధనాభివృద్ధి జరిగే వ్యాపార కార్యకలాపాల వైపునకు తేవడానికి కూడా మీరు వడ్డీ మార్గాన్ని ఎంచుకుంటారు. సామూహిక ప్రయోజనంపై మీరు జరుపుతున్న రెండవ దౌర్జన్యం ఇది. ఈ విధంగా జమ అయిన ధనాన్ని లేక పెట్టుబడిని వ్యాపారంలో ఎంత లాభం వస్తుందో అందులో నుండి పెట్టుబడిదారులకు ఒప్పందం ప్రకారం లాభం వస్తుందని చెప్పి, ధనాన్ని అందులో వినియోగించినా, అంత వరకు కూడా సబబుగానే ఉండేది. కాని దానికి బదులు మీరేం చేస్తున్నారు? ఆ వ్యాపారంలో లాభంరానీ, రాకపోనీ, లాభం తక్కువ వచ్చినా ఎక్కువ వచ్చినా, ఎవరు ఏ నట్టేట మునిగినా పెట్టుబడిదారు మాత్రం తప్పకుండా ఇంత శాతం లాభం పొందుతాడనే షరతుతో ధనాన్ని (పెట్టుబడిని) ఆర్థిక వ్యవస్థలో ప్రవేశపెడుతున్నారు. ఈ విధంగా మీరు సామూహిక ఆర్థిక వ్యవస్థకు రెండవ నష్టాన్ని కలిగించారు. డబ్బును ఖర్చు చేయకుండా ఆపి ఉంచడం వల్ల ఒక నష్టం ఎలాగూ వాటిల్లింది. ఇక ఏ ధనమయితే ఆగిపోయిందో, అది సామూహిక ఆర్థికం వైపు మరలినా కూడా, భాగస్వామ్యపు ప్రాతిపదికన వ్యాపారంలో పాల్గొనకుండా, దానికి భిన్నంగా అది అప్పుగా మారి, సమాజ మంతటా పారిశ్రామిక, వాణిజ్య రంగాలపై భారమై కూర్చున్నది, ఇంకా మీ చట్టాలు దానికి నిశ్చిత లాభపు పూచీనిచ్చేశాయి. మీరు రూపొందించిన ఈ తప్పుడు వ్యవస్థ వల్ల పరిస్థితి ఎలా మారిందంటే కొనుగోలు శక్తిని కలిగి ఉండే సమాజంలోని అత్యధిక మంది దాన్ని (అనగా కొనుగోలు శక్తిని) సామూహిక ఉత్పత్తుల్ని కొనడంలో వినియోగించడానికి బదులు చేతిని ఆపుకుంటూ, జమ చేసుకుంటూ వడ్డీతో కూడిన అప్పుల రూపంలో సమాజం నెత్తిన రుద్దుతూ పోతున్నారు. ఇక సమాజం దినదినం పెరుగుతూ పోతున్న ఈ అప్పును, వడ్డీని

తీర్చేదెలా? అనే జఠిల సమస్యతో సతమతమైపోతున్నది. ఈ రకంగా పెట్టు బడులు పెట్టి తయారు చేసిన సరుకుల అమ్మకం అంగళ్ళలో కష్టతరమై పోతున్నది. లక్షలు కాదు, కోట్ల సంఖ్యలోనున్న ప్రజలు దాన్నెందుకు కొనడం లేదంటే, అవి కొనడానికి వారి దగ్గర చాలినన్ని డబ్బుల్లేవు. ఇక డబ్బున్నప్పటికీ, కొనుగోలు చేసే శక్తి ఉన్నప్పటికీ వేలాది మంది వాటిని కొనడం లేదు. ఎందు కంటే తమ ఈ కొనుగోలు శక్తిని ఇంకనూ వడ్డీతో కూడిన అప్పులుగా మార్చ డానికి ఆపుతూ, కూడబెడ్తూ పోతున్నారు.

ధనాన్ని దుబారాగా ఖర్చుపెట్టకుండా దీన్ని ఎక్కువకు ఎక్కువ లాభ మిచ్చే పద్ధతిలో వినియోగించాలంటే ఈ వడ్డీని ఎరగా పెడితేనే వ్యాపారవేత్త వివశుడైపోతాడని మీరు దీని లాభాన్ని పేర్కొంటున్నారు. ఇది మౌనంగా ఉంటూనే వ్యాపారాన్ని శాసిస్తూ మార్గదర్శకం చేస్తుందని వడ్డీ రేటు మహత్యాన్ని ఏకరువు పెడుతున్నారు. ధనం తన ప్రవాహం కోసం సాధ్యమయ్యే మార్గా లన్నిటిలో నుండి అత్యధిక లాభాన్నిచ్చే వ్యాపారాన్ని ఏరుకుంటుందని కూడా చెబుతున్నారు. కాని మీ ఈ కవిత్వపు ముసుగును తొలగించి, దాని వెనుక దాగి ఉన్న అసలు వాస్తవమేమిటో చూడాలి. 'లాభము' మరియు 'రాబడి' కి సంబంధించిన ఇతరత్రా శ్రేయోదాయక మార్గాలు అన్నీ కూడా ఈ వడ్డీ కారణంగా వంచించబడ్డాయి. ఈ పదాలకు అర్థం కేవలం ఒకే ఒకటి మిగిలిపోయింది. "ఆర్థిక లాభం– భౌతిక ప్రయోజనం" (ఆదాయం). ఇది వడ్డీ సమకూర్చిన మొదటి లాభం. ఈ విధంగా ధనానికి (పెట్టుబడికి) గొప్ప స్థిమితం లభించింది. అంతకు ముందు (అంటే వడ్డీకి ముందు) అది "ఆర్థిక లాభం" కాకుండా, ఇంకితర విధములైన లాభాలుండే మార్గాలపై కూడా పయనించేది. కాని ఇకిప్పుడది తిన్నగా "ఆర్థిక లాభం" ఉన్న మార్గాలను మాత్రమే ఎన్నుకుంటుంది. ఇక ఈ వడ్డీ వల్ల సమకూరే రెండవ లాభం

ఏమిటంటే, ఇది తనదైన ఒక ప్రత్యేక రేటు ద్వారా, పెట్టుబడి యొక్క ఒక వినియోగ ప్రమాణాన్ని నిర్ణయిస్తుంది. దాని దృష్టిలో సమాజ శ్రేయం ముఖ్యం కాదు. పెట్టుబడిదారుకు కలిగే లాభమే ముఖ్యం. పెట్టుబడి ఏ కార్యంలో వినియోగింపబడాలి లేక పెట్టుబడిదారుకు సంవత్సరానికి 6 శాతం లేక అంతకన్నా ఎక్కువ లాభం ఏది ఇవ్వగలుగుతుంది అనే విషయాన్ని వడ్డీ రేటు నిర్ణయిస్తుంది. అంతకన్నా తక్కువ లాభాన్నిచ్చే ఏ పనైనా సరే, అది పెట్టుబడి పెట్టడానికి పనికి వచ్చే రంగం కాదు. ఉదాహరణకు, పెట్టుబడి సమక్షంలో రెండు ప్రతిపాదనలు లేక ప్రాజెక్టులు వస్తాయనుకోండి. ఒక ప్రాజెక్టులో అన్ని సౌకర్యాలతో కూడిన తక్కువ అద్దెకు, పేదవారు చెల్లించగలిగే అద్దెకు ఇవ్వగలిగిన ఇళ్ళ నిర్మాణం దాని ఉద్దేశం. రెండవ ప్రతిపాదన లేక స్కీం ఏమిటంటే ఒక బ్రహ్మాండమైన ఎ.సి.తో కూడిన సినిమా హాలు నిర్మాణం. మొదటి ప్రాజెక్టు 6 శాతం కన్నా తక్కువ వడ్డీ ఆశ చూపిస్తుంది. అయితే రెండవ స్కీం అంతకన్నా ఎక్కువ వడ్డీని ఇప్పిస్తుంది. ఇంతకు ముందున్న పరిస్థితుల్లోనైతే పెట్టుబడి "తెలివి తక్కువతనం"తో మొదటి స్కీం వైపునకు పయనించే అవకాశం ఉంటుండేది. ఈ రెండింటిలో ఏది ఎన్నుకోవాలనే విషయంలో కనీసం అది మీమాంసలోనైనా పడిపోయేది. కాని వడ్డీ రేటు మహత్యం చూడండి, అది పెట్టుబడిని ఆలోచించడానికైనా అవకాశం ఇవ్వకుండా తిన్నగా రెండవ స్కీం వైపునకు లాక్కొనిపోతుంది. ఇది పెట్టుబడిని మొదటి స్కీం వైపు కన్నెత్తి చూడడానికి కూడా అవకాశం లేకుండా చేస్తుంది. ఈ వడ్డీ రేటులోని ఇంకొక దుర్గణం ఏమిటంటే, అప్పు తీసుకున్న వ్యాపారిని ఎట్టి పరిస్థితుల్లోనైనా సరే, తన లాభాన్ని వడ్డీ రేటు కన్నా పైపైగానే ఉంచడానికి అతన్ని వివశుణ్ణి చేసేస్తుంది. దీని కోసం అతను ఎన్నెన్ని అనైతిక చర్యలకు పాల్పడాల్సి వచ్చినా సరే. ఉదాహరణకు: ఒక వ్యక్తి ఒక ఫిల్మ్ ఇండస్ట్రీని తెరిచాడనుకోండి, అందులో

అతను సంవత్సరానికి ఆరు శాతం చొప్పున వడ్డీ రేటుపై లభించిన పెట్టుబడిని ఉపయోగిస్తున్నాడనుకోండి. అతను చేస్తున్న ఈ వ్యాపారంలో అతని లాభం తప్పకుండా ఆరు శాతానికి మించి రావాలని అతను శతవిధాల ప్రయత్నించాల్సి ఉంటుంది. నైతికంగా సభ్యత కలిగి, జ్ఞానోదయం కలిగించే చిత్రం (ఫిల్మ్) తీయడం వలన అతని లాభం ఆరు శాతానికి మించి రాదని తేలిపోయినప్పుడు అతనేం చేస్తున్నాడు? నగ్న చిత్రాలతో జుగుప్సాకరమైన సన్నివేశాలతో అతనీ చిత్రాన్ని రూపొందించి, ఇంకా ఇలాంటి అశ్లీల పోస్టర్లనే విడుదల చేసి, ప్రజల లైంగిక భావోద్రేకాల్ని రెచ్చగొట్టి ప్రజలు తండోప తండాలుగా వచ్చి అతని సినిమా చూడడానికి వివశుల్ని చేస్తాడు. అయితే అతని ఈ పనికి వివశుణ్ణి చేసిన విషయం ఏదంటారు? అదే వడ్డీ తన అప్పుపై, తన పెట్టుబడిపై పెట్టుబడిదారు నిర్ణయించిన వడ్డీ రేటుకన్నా అధికంగా వస్తేనే తాను పడిన శ్రమకు కాస్త ఉపశమనం లభిస్తుంది.

ఇవండీ వడ్డీ ద్వారా ఒనగూరే మీ ప్రయోజనాల వాస్తవికత! ఇవి పొందాలంటే వడ్డీ తప్ప ఇంకే మార్గమూ లేదు. వడ్డీతో తప్ప ఇంకే విధంగానూ తీరని మీ "అవసరాన్ని" కూడా ఒకసారి విశ్లేషించి చూద్దాం. అప్పు అనేది నిస్సందేహంగా మానవ జీవితావసరాల్లో ఒకటి. దీని అవసరం ప్రజలకు తమ వ్యక్తిగత అవసరాల్లోనూ పడుతుంది. పరిశ్రమలు. వ్యాపారం మరియు వ్యవసాయం లాంటి ఆర్థిక కార్యకలాపాల్లోనూ ప్రతి నిత్యం దీని అవసరముంటుంది. ఇంకా ప్రభుత్వంతో సహా సామూహిక సంస్థలన్నీ కూడా అప్పులకు అగత్యపడే ఉంటాయి. వడ్డీ లేకుండా అసలు అప్పులు పుట్టడమే అసాధ్య మనడం మాత్రం నిజం కాదు. వ్యక్తులు మొదలుకొని జాతుల వరకు వడ్డీ లేకుండా అప్పులు దొరకకపోవడానికి అసలు కారణం మీరు వడ్డీని చట్టపరంగా అనుమతించారు. దీన్ని నిషేధించండి, ఇంకా ఆర్థిక వ్యవస్థతో పాటు ఇస్లాం ప్రతిపాదించే నైతిక వ్యవస్థను కూడా అవలంబించండి. వ్యక్తిగత

అవసరాలకు, వ్యాపారానికి, సామూహిక అవసరాలకు, ప్రతీ దానికి వడ్డీ లేకుండా అప్పులు దొరకడం మీరే చూస్తారు. అప్పులే కాదు, దానాలు కూడా లభిస్తాయి. ఇస్లాం ఆచరణాత్మకంగా దీనికి సాక్ష్యమిచ్చింది. ముస్లిం సమాజం శతాబ్దాల తరబడి వడ్డీ లేకుండా శ్రేష్టమైన పద్ధతిలో తన ఆర్థిక కార్యకలాపాలన్నిటినీ సమర్ధవంతంగా నడిపిస్తూ వచ్చింది. ఇప్పటి మీ ముదనష్టపు వడ్డీ కాలానికి పూర్వం, అతని వారసునికి వడ్డీ లేకుండా అప్పు పుట్టని కారణంగా శవం అంత్య క్రియలకు నోచుకోక దిక్కుమాలిన పరిస్థితిలో పడి ఉండే దౌర్భాగ్యపు పరిస్థితిని ముస్లిం సమాజం ఎన్నడూ ఎదుర్కొని ఉండలేదు. లేక వడ్డీ లేకుండా అప్పు దొరకని కారణంగా ముస్లింల వ్యాపార వాణిజ్యాలు, పరిశ్రమలు, వ్యవసాయాలు మాంద్యానికి గురి అయినట్లు, మూతబడ్డట్లు ఎక్కడా కనిపించదు. వారి ప్రజలు వడ్డీ లేకుండా అప్పులు సమకూర్చని కారణంగా ముస్లిం ప్రభుత్వాలు ప్రజాసంక్షేమ కార్యక్రమాలను, ఇతర అవసరాలను నెరవేర్చలేకపోయాయనే మాటే వినిపించదు. కాబట్టి వడ్డీలేని అప్పు పుట్టడం అసంభవమని, అప్పుల సౌధం, ఇచ్చిపుచ్చుకునే భవనపు పునాది కేవలం వడ్డీపై మాత్రమే లేవగలదనే మీ తార్కిక వాదనకు ఖండనే అవసరం లేదు. మేము శతాబ్దాల తరబడి దీన్ని ఆచరించి, మీ వాదనలో పస లేదని నిరూపించాము.

అయితే నేటి ఈ కాలంలో వడ్డీలేని అప్పులు సమకూరడం క్రియాపూర్వకంగా ఎలా సాధ్యమనే విషయం మన ఈ అధ్యాయంతో సంబంధంలేనిది. దీనిపై రాబోయే అధ్యాయంలో చర్చించుకుందాం.

## సకారాత్మక దృష్టికోణం (దృక్పథం)

గడిచిన అధ్యాయంలో మనం చర్చించుకున్న దాన్నిబట్టి రూఢీ అయిందేమిటంటే వడ్డీ అనేది సముచితమైనదీ కాదు, న్యాయబద్ధమైనదీ కాదు,

దాని ఆర్థిక అవసరం కూడా లేదు. ఇంకా వాస్తవం చెప్పాలంటే, అందులో లాభం కలిగించే ఒక్క గుణం కూడా లేదు. వడ్డీ నైషధం కేవలం ఈ నకారాత్మక కారణాలపై మాత్రమే ఆధారపడి లేదు. దాని అసలు కారణం అది ఖచ్చితంగా ఒక అనర్థదాయకమైన వస్తువు. ఇంకా అనేకానేక కారణాల దృష్ట్యా అది అత్యంత నష్టమైనది.

వివేకవంతుడైన మనిషికి వడ్డీ అపవిత్రతకు సంబంధించి లేశమైనా అనుమానం మిగిలి పోకుండా, ఒక్కొక్కటిగా చూపిస్తూ ఈ అధ్యాయంలో దాని నష్టాల వివరాలను విశ్లేషించుకుందాం.

## వడ్డీ యొక్క నైతిక, ఆధ్యాత్మిక నష్టాలు

మొట్టమొదటగా నైతిక, ఆధ్యాత్మిక దృష్టికోణంతో పరిశీలిద్దాం. ఎందు కంటే నైతికత మరియు ఆత్మయే మానవతకు అసలు జీవనాడి. అందుచేత ఏ విషయమైనా మనలోని ఈ జీవనాడినే గనక నష్టపరిచేదైతే, ఇతరత్రా కోణాలలో అందులో ఎన్ని ప్రయోజనాలున్నా సరే, అటువంటి దాన్ని త్యజించక తప్పదు. ఇక ఇప్పుడు మీరు వడ్డీ యొక్క స్వాభావిక విశ్లేషణే గనక చేసి నట్లయితే, ఒక్క చూపులోనే ధనాన్ని కూడబెట్టే దాని కాంక్ష మొదలుకుని వడ్డీ వ్యాపారానికి సంబంధించిన వివిధ ఘట్టాల వరకు మొత్తం దాని మానసిక ప్రక్రియ అంతా స్వార్థం, లోభత్వం, సంకుచితత్వం, హృదయ కాఠిన్యం, ధన దాహం లాంటి అల్ప, నీచ గుణాల నీడలోనే కొనసాగుతుంది. ఇంకా మనిషి ఈ వ్యాపారంలో ముందుకు పోయిన కొద్దీ నీచ గుణాలే అతనిలో వృద్ధి చెందుతూ పోతాయి. దీనికి భిన్నంగా జకాత్ మరియు దాన ధర్మాలు దాని ప్రారంభపు తలంపు మొదలుకొని అది కార్యరూపం దాల్చేంత వరకూ దాని సంపూర్ణ మానసిక క్రియ దాతృత్వం, త్యాగం, సానుభూతి, జాలి, హృదయ విశాలత, శ్రేయోభిలాష మరియు పరోపకారం లాంటి సద్గుణాల ప్రభావంతో

దిన దిన ప్రవర్ధమానమవుతూ ఉంటాయి. ఇంకా ఇదే తరహాలో కొనసాగుతూ పోతుంటే ఇవే గుణాలు మనిషిలో వికసిస్తూ పోతాయి. నైతికతలకు సంబంధించిన పై రెండు రకాల గుణాల్లో మొదటిది అత్యంత హేయమైనదని, రెండవది అత్యంత శ్రేయస్కరమైనదని అతని హృదయం సాక్ష్యమివ్వని ఏ ఒక్క మనిషైనా ఈ భువిపై ఉంటాడంటారా?

## సామాజిక, సామూహిక నష్టాలు

ఇక ఇప్పుడు సామాజిక దృష్టికోణంతో ఆలోచించి చూడండి. ఏ కాస్త ఆలోచించినాసరే, ప్రతి మనిషికి ఇది అవలీలగా అర్థమైపోతుంది. ఏ సమాజంలోనయితే ప్రజలు పరస్పరం స్వార్థంతో వ్యవహరిస్తారో, ఏ ఒక్కరూ కూడా తన స్వంత ప్రయోజనం, స్వంత లాభం లేకుండా వేరొకరికి సహకరించరో, ఏ వ్యవస్థలోనయితే ఒకరి అవసరం, అగత్యం వేరొకరికి లాభపడే అవకాశంగా మారుతుందో, ధనిక వర్గాల ప్రయోజనాలు పేద వర్గాల ప్రయోజనాలకు విఘాతంగా పరిణమిస్తాయో - ఇలాంటి సమాజం ఎన్నటికీ సుసంఘటితం కాజాలదు. దాని విభిన్న భాగాలు సతతం విచ్ఛిన్నత వైపుకే పోతాయి. చెల్లా చెదురవుతాయి. ఈ పరిస్థితికి ఇంకా ఇతర కారణాలు కూడా తోడైతే ఇలాటి సమాజపు భాగాలు పరస్పరం ఢీ కొనడం, సంఘర్షణ వైపునకు దారి తీయడం కూడా పరిపాటే. దీనికి భిన్నంగా ఏ సమాజపు సామూహిక వ్యవస్థ పరస్పర సహానుభూతిపై ఆధారపడి ఉంటుందో, ఏ ప్రజలయితే ఒండొకరిపట్ల దాతృత్వంతో మెలుగుతారో, అందులోని ప్రతి వ్యక్తి ఇంకొకరికి అగత్యం వచ్చిపడినప్పుడు విశాల హృదయంతో తన అక్కున చేర్చుకుంటాడో, అందులోని ధనిక ప్రజలు పేద ప్రజలకు దయ కనికరాలతో సహాయ మందిస్తారో, కనీసం న్యాయసమ్మతమైన సహాయ పద్ధతిని అవలంబిస్తారో- అలాంటి సమాజంలో పరస్పర ప్రేమ, సానుభూతి, అన్యోన్యత విలసిల్లుతాయి. ఆ

సమాజపు వివిధ భాగాలు పరస్పరం సమన్వయం చెందుతూ, సహకరించు కుంటూ తోడుగా నిలుస్తాయి. అందులో అంతర్గత కుమ్ములాట, వివాదం జొరబడడానికి ఆస్కారం ఉండదు. అందులో పరస్పర సహకారం, సానుభూతి కారణంగా అభివృద్ధి వేగం మొదటి రకపు సమాజంతో పోల్చి చూసుకున్నప్పుడు ఎంతో ముందంజలో ఉంటుంది.

అంతర్జాతీయ సంబంధాలకు సంబంధించి కూడా ఇదే పరిస్థితి వర్తిస్తుంది. ఒక జాతి ఇంకొక జాతి పట్ల ఔదార్యంతో, సానుభూతితో మెలగాలి. ఇంకా దాని కష్టకాలంలో నిర్మల మనస్సుతో సహాయ సహకారాలందించాలి. అలా జరిగినప్పుడు ఎదుటి వారి నుండి కూడా ప్రేమ, కృతజ్ఞతా భావం, నిష్కల్మషమైన ఉపకారాలతో కూడిన సమాధానం లభిస్తుంది. దీనికి భిన్నంగా అదే జాతి తన పొరుగు జాతితో స్వార్థబుద్ధితో, పిసినారితనంతో వ్యవహరించి నప్పుడు, దాని కష్టాలను సొమ్ము చేసుకోదలిచినప్పుడు, ఆర్థిక రూపంలో అది ఎంతో కొంత లాభపడితే పడవచ్చు గాని పొరుగు జాతి పట్ల ఆ జాతి హృదయంలో రవ్వంత నైర్మల్యతగాని, ప్రేమగానీ, వాత్సల్యంగాని మిగిలి ఉండడానికి ఆస్కారమే ఉండదు. ఇది జరిగి ఎంతో కాలం కాలేదు. గడచిన రెండవ ప్రపంచ యుద్ధకాలం నాటి మాట. బ్రిటన్ అమెరికాతో ఒక పెద్ద అప్పు ఒప్పందాన్ని కుదుర్చుకుంది. ఇది బ్రెట్టన్ ఉడ్ అగ్రిమెంట్ అనే పేరుతో ప్రఖ్యాతి గాంచింది. యుద్ధంలో మిత్ర దేశంగా పాల్గొన్న, సంపన్న మిత్ర దేశమైన అమెరికా, ఎలాంటి వడ్డీ లేని రుణం తనకివ్వాలని బ్రిటన్ కాంక్షిం చింది. కాని అమెరికా వడ్డీని వదులుకోవడానికి రాజీపడలేదు. ఇక బ్రిటన్ తనకు కష్టాలున్నప్పటికీ నిస్సహాయ స్థితిలో వడ్డీ చెల్లించడానికి అంగీక రించింది. కాని దాని ప్రభావం ఆంగ్ల జాతిపై ఎలా పడిందో తెలుసుకోవడానికి అప్పటి రాజకీయ నాయకులు, పత్రికా సంపాదకుల ప్రసంగాలు, వ్యాసాలు

పరిశీలిస్తే అవలీలగా అర్థమైపోతుంది. బ్రిటన్ తరఫున ఈ ఒప్పందాన్ని ఆమోదించిన ప్రఖ్యాత అర్ధశాస్త్ర నిపుణుడు, దివంగత లార్డ్ కీన్జ్ తన మిషన్ను పూర్తి చేసి ఇంగ్లండ్‌కు వెనుదిరిగిన తరువాత బ్రిటన్ పార్లమెంటు (హౌస్ ఆఫ్ లార్డ్స్)లో ఈ ఒప్పందానికి సంబంధించి ఉపన్యసిస్తూ ఇలా అన్నారు: "అమెరికా వడ్డీలేని అప్పు ఇవ్వడానికి ఇష్టపడలేదనే బాధ నేను జీవితాంతం మరిచిపోలేను." అమెరికాను ఎంతో అభిమానించే చర్చిల్ లాంటి వ్యక్తి ఇలా అన్నాడు: "మా పట్ల జరిగిన ఈ షావుకారితనపు వ్యవహారంలో, దానిలోని లోతుల్లో నాకు పెద్ద ప్రమాదం కనబడుతున్నది. దీనివల్ల మా ఇరు దేశాల పరస్పర సౌహార్ద సంబంధాలపై చెడు ప్రభావం పడిందనే విషయం మాత్రం నిజం." ఆనాటి ఆర్థిక మంత్రి డా.డాల్టన్ ఈ ఒప్పందాన్ని ఆమోదం కోసం పార్లమెంటులో సమర్పిస్తూ ఇలా అన్నాడు: "అత్యంత బరువును మోసుకుంటూ యుద్ధం నుండి మేము బయటికి వస్తున్నాము. ఉమ్మడి లక్ష్యాల కోసం మేము చేసిన త్యాగాలకు, పడిన కష్టాలకు లభిస్తున్న ఇదో విచిత్రమైన ప్రతిఫలం. అపూర్వమైన ఈ హింసాపూరిత బహుమానంపై రాబోయే కాలపు చరిత్రకారులే ఏదైనా చక్కటి అభిప్రాయాన్ని వ్యక్తపరచగలరేమో..... మాకు వడ్డీరహిత అప్పు కావాలని మేము విన్నవించుకున్నాం. కాని ఇది క్రియాత్మక రాజకీయం కాదని మాకు సమాధానం ఇవ్వబడింది."

ఇదీ వడ్డీకి సంబంధించి దాని స్వాభావిక, అనివార్య మనస్తత్వపు ప్రభావం. ఇది ఎల్లప్పుడు, అన్ని పరిస్థితుల్లోనూ వ్యక్తమవుతూ ఉంటుంది. ఒక జాతి ఇంకొక జాతితో వ్యవహారం చేసినాసరే లేక ఒక మనిషి ఇంకొక మనిషితో వ్యవహారం చేసినాసరే. వ్యక్తిగత వ్యవహారాల్లో వడ్డీ ఇచ్చిపుచ్చు కోవడం ఒక చెడు విషయమనే దాన్ని ఇంగ్లాండ్ ప్రజలు అంగీకరించేవారు కాదు. నేడు కూడా వారు దీనికి అంగీకరించరు. మీరొక బ్రిటిష్ పౌరునితో

వడ్డీ లేని అప్పు గురించి మాట్లాడండి. అతను వెంటనే ఇచ్చే జవాబు ఇలా ఉంటుంది: "మహాశయా! ఇది ఆచరణాత్మక వర్తకం (Practical Business) కాదండీ" – కాని అతని జాతి విపత్కర పరిస్థితిలో ఉన్నప్పుడు అతని పొరుగు జాతి అతనితో ఈ 'క్రియాపూర్వక' వ్యవహార (Practical Business) పద్ధతిని అవలంబించినప్పుడు ఆంగ్లేయుడు గావుకేక వేశాడు. ఇంకా వడ్డీ అనేది హృదయాల్ని చీల్చేసేది, సంబంధాల్ని చెడగొట్టేదనే సత్యానికి ప్రపంచమంతటి ముందు సాక్ష్యమిచ్చాడు.

## ఆర్థిక నష్టాలు

ఇక ఇప్పుడు దాని ఆర్థిక కోణాలపై దృష్టి సారించండి. ఆర్థిక జీవనానికి సంబంధించి అప్పులు ఇచ్చిపుచ్చుకునే సందర్భాల్లోనే వడ్డీ ప్రస్తావన వస్తుంది. అప్పుల్లో వివిధ రకాలుంటాయి:

1. అవసరం, అగత్యం ఉన్న ప్రజలు తమ వ్యక్తిగత అవసరాల కోసం తీసుకునే అప్పులు ఒక కోవకు చెందుతాయి.

2. ఇంక రెండవ రకానికి చెందిన అప్పులు – వ్యాపారులు, వివిధ వృత్తి పనివాళ్ళు, భూస్వాములు మొదలగువారు లాభదాకయకమైన తమ పనుల్లో, వ్యాపారాల్లో వినియోగించడానికి తీసుకుంటుంటారు.

3. ప్రభుత్వాలు తమ ప్రజల నుండి తీసుకునే అప్పులు మూడవ రకానికి చెందుతాయి. ఇంకా వాటి స్వభావ స్వరూపాలు, ప్రత్యేకతలు కూడా వేర్వేరుగానే ఉంటాయి. ఇలా తీసుకున్న అప్పుల్లో నుండి కొన్ని లాభేతర కార్యక్రమాల కోసం ఉపయోగించబడుతుంటాయి. ఉదాహరణకు, కాలువల త్రవ్వకాలకు, రైల్వేలైన్లు వేయడానికి, విద్యుత్తు, నీటి సరఫరాల కోసం – ఇలా వివిధ పనుల కోసం అవి తీసుకోబడతాయి.

4. ప్రభుత్వాలు తమ అవసరాల కోసం విదేశీ ద్రవ్యనిధుల నుండి తీసు కునే అప్పులు నాలుగవ రకానికి చెందుతాయి.

వీటిలో నుండి ఒక్కొక్కదాన్ని విడదీసి, వాటిపై వడ్డీ చెల్లించడం వల్ల కలిగే నష్టాలేమిటో పరిశీలిద్దాం.

## అగత్యపరుల (అవసరార్థుల) అప్పులు

వడ్డీపై అప్పిచ్చే వ్యాపారాల్లో (Money Lending Business) వడ్డీ వ్యవహారం ప్రపంచమంతటిలో అత్యధికంగా జరుగుతూ ఉంటుంది. ఈ మహమ్మారి కేవలం మన ఉపఖండం వరకే పరిమితం కాదు, ఇదో విశ్వ వ్యాపితమైన మహమ్మారి. దీని బారి నుండి ప్రపంచంలోని ఏ ఒక్క దేశమూ సురక్షితంగా లేదు. దీనికి కారణం ఏమిటంటే, పేద, మధ్య తరగతి ప్రజలకు వారి అత్యవసర పరిస్థితిలో అవలీలగా అప్పు దొరికే, వడ్డీరహిత అప్పులు కాకపోయినా కనీసం వ్యాపార రేట్లకు వర్తించే వడ్డీ రేటుపై అప్పులు దొరికే వ్యవస్థ ప్రపంచంలో ఎక్కడా లేదు. ప్రభుత్వం దీన్ని తన విధుల్లో లేదని భావిస్తుంది. సమాజానికి దీని అవసరం గురించిన ధ్యాసే లేదు. ఇక బ్యాంకులు కూడా లక్షలు, కోట్లు కుమ్మరించే స్కీంలలో, వ్యాపారాల్లో మాత్రమే పాలుపంచుకుంటాయి. ఇది కాకుండా కొద్దిపాటి ఆదాయం వచ్చే మనిషి, తన ఒక గత్యతరంలేని అవసరం కోసం బ్యాంకు వరకు వెళ్ళి అప్పులు పొందడం సంభవం కూడా కాదు. ఈ కారణాల వల్ల కార్మికులు, రైతులు, చిన్న చిన్న వృత్తి పనివాళ్ళు, తక్కువ జీతాలు పొందే ఉద్యోగులు, సామాన్య పేద ప్రజలు ప్రతి దేశంలోనూ ఉంటారు. ఇలాంటి వారు తమ గత్యంతరంలేని పరిస్థితిలో తమ లొకాలిటీలకు సమీపంలోనే తచ్చాడే ఈ రాబందుల వంటి వడ్డీ వ్యాపా రుల వద్ద అప్పు తీసుకోవడానికి వివశులైపోతారు. ఈ రకమైన వ్యాపారంలో వడ్డీ రేటు ఎంత అత్యధికంగా ఉంటుందంటే ఒక్కసారి ఈ రాబందుల కబంద

హస్తాల్లో చిక్కుకున్నవారు, ఇక జీవితాంతం దీన్నుండి బయటపడలేరు. తాత తీసుకున్న అప్పు పరంపర మనవడి వరకు వారసత్వంగా కొనసాగుతూనే ఉంటుంది. అసలు కన్నా ఎన్నో రెట్లు ఎక్కువ వడ్డీ చెల్లించినప్పటికీ అసలు అనే గుదిబండ అతని మెడలో వ్రేలాడుతూనే ఉంటుంది. ఇంకా కొన్ని సందర్భాల్లో జరిగేదేమిటంటే ఋణగ్రహీత కొంత కాలం వరకు వడ్డీ చెల్లించే స్థోమత లేక ఆగిపోయినప్పుడు, పెరిగిన వడ్డీని అసలుతో కలిపి అదే షావుకారు తన రుణం, వడ్డీ వసూలు చేసుకోవడానికి, ఇంకా అధిక వడ్డీ రేటుతో ఇంకొక పెద్ద అప్పును ఆ ఋణగ్రహీతకు ఇస్తాడు. పాపమా పేదవాడు ఇంకా పెద్ద ఋణ భారానికి గురి అవుతాడు. ఇంగ్లాండ్‌లో ఇలాంటి వ్యాపారాల్లో కనీస వడ్డీ రేటు సాలుకు 48 శాతం, ఇంకా చట్ట రీత్యా అతనికి అది ఇప్పించబడు తుంది. అయితే అక్కడ కొనసాగే ఇలాంటి లావాదేవీల్లో సామాన్య వడ్డీరేటు సాలుకు 250 నుండి 400 శాతం వరకు ఉంటుంది. ఇదే కాదండీ, సాలుకు 1300 శాతం వరకు కూడా వ్యవహారాలు నడిచిన సందర్భాలున్నాయి. అమెరికాలో వడ్డీ వ్యాపారుల కోసం అనుమతింపబడిన వడ్డీ రేటు సాలీనా 30 నుండి 60 శాతం. కాని వీరి సామాన్య వడ్డీ వ్యాపారాలు సాలుకు 100 నుండి 260 శాతం వరకు నడుస్తుంటాయి. తరచుగా ఈ వడ్డీ రేటు సాలుకు 400 శాతం వరకు చేరిన సందర్భాలు కూడా ఉన్నాయి. స్వయంగా మన ఈ ఉపఖండంలో ఒక పేదవానికి సాలుకు 48 శాతం వడ్డీపై అప్పిచ్చిన వ్యాపారి మంచివాడుగా పరిగణింపబడతాడు. లేకుంటే సామాన్య వడ్డీ రేటు 75 శాతం ఉంటుంది. తరచుగా ఇది సాలుకు 150 శాతం వరకూ చేరుకుంటూ ఉంటుంది. ఇంకా సాలుకు 300 మరియు 350 శాతం వరకు కూడా ఈ రేట్లు పెంచిన సందర్భాలున్నాయి.

ఇదండీ ఆ మహమ్మారి పరిస్థితి. ప్రతి దేశంలోని పేద, మధ్యతరగతి ప్రజల అత్యధిక సంఖ్య దీని కబంధ హస్తాల్లో నలిగిపోతున్నది. దీని కారణంగా

అల్పాదాయం ఉన్న వ్యక్తుల ఆదాయంలోని అత్యధిక భాగం ఈ వడ్డీ వ్యాపారే లాగేసుకుంటున్నాడు. రాత్రింబవళ్ళు కష్టపడి, చెమటోడ్చినందుకు లభించే ఈ అల్పాదాయం, ఈ కూలీ నుండి ఒక పెద్ద భాగం వడ్డీ కింద పోయిన తరువాత, వారికి రెండు పూటల భోజనం కూడా కరువైపోతుంది. ఇది వారి నైతికతల్ని, నడవడికల్ని చెడగొట్టడమే కాకుండా వారిని నేర ప్రవృత్తి వైపునకు నెట్టేస్తుంది. ఈ పరిస్థితి వల్ల వారి జీవన ప్రమాణం దిగజారిపోవడమే కాకుండా వారి సంతానపు విద్యాబుద్ధుల స్థాయిని అత్యంతగా దిగజార్చుతుంది. అంతే కాకుండా దీని వల్ల కలిగే మరో కీడు ఏమిటంటే వారిని ఎడతెగని చింతా వ్యాకులతకు గురిచేసి సామాన్య కార్యకర్తల పని సామర్థ్యపు స్థాయిని బాగా క్షీణింపజేస్తుంది. తమ కష్టార్జితాన్ని ఇంకొకరు ఎగరేసుకుపోతున్నారని వారు గమనించినప్పుడు తమ పని పట్ల వారి నిమగ్నత సన్నగిల్లిపోతుంది. ఈ కోణంతో చూసినప్పుడు వడ్డీ కార్యకలాపాల ఈ వైనం స్వతహాగా ఒక దౌర్జన్యమే కాకుండా దీని వల్ల సామూహిక, ఆర్థిక వ్యవస్థకు కూడా భారీ నష్టం వాటిల్లుతుంది. ఎవరైతే ఒక జాతి అసలు ఉత్పత్తిదారులో (కార్మికులు, కర్షకులు, పని వాళ్ళు), ఎవరి శ్రమ ప్రయాసల వల్ల జాతి సంపద పెరుగుతున్నదో, దేని భుజస్కంధాల మీదైతే జాతి సామూహిక స్థితిమంతం (ఐశ్వర్యం) ఆధారపడి ఉందో, అలాంటి ప్రాథమిక, మౌలిక శ్రమజీవులపై వారి రక్తాన్ని పీల్చే జలగలను ఎగదోసి, వారిని సొమ్మసిల్లజేయడం ఎంత విచిత్రమైన అవివేకమో ఆలోచించి చూడండి. మలేరియా లాంటి జ్వరాల వల్ల ఇన్ని గంటల ఉత్పత్తి తగ్గిపోయిందని మీరు లెక్కలు కడతారు. ఇంకా మలేరియా దోమల్ని నాశనం చేయడానికి వాటిపై విరుచుకుపడతారు. కాని మీలోని ఈ వడ్డీ వ్యాపారులు లక్షల మంది కార్మికులను ఎంతగా వేధిస్తున్నారో, ఎంత వ్యాకులతకు గురి చేస్తున్నారో, వారినెంత అన్యమనస్కులుగా, నిరాశా పరులుగా మారుస్తున్నారో, వారి శ్రామిక శక్తికి, వారి ఉత్సాహానికి ఎంతగా హాని కలిగిస్తున్నారో

మీరెప్పుడైనా ఆలోచించారా? అయితే మీ ఆలోచనలు తద్భిన్నంగా ఉన్నాయి. పరోక్షంగా జాతి ప్రయోజనాల్ని దెబ్బతీస్తున్న ఈ వడ్డీ వ్యాపారుల్ని సమాప్తం చేయడానికి బదులు, మీరు వారికి బాసటగా నిలుస్తున్నారు. వారి ఋణగ్రహీ తల్ని పట్టి న్యాయస్థానాలకు అప్పగిస్తున్నారు. మీ ప్రజల (కార్యకర్తల) శరీరాల నుండి చివరి రక్తపు బొట్టును పిండే పనిని వడ్డీ వ్యాపారులు చేయలేని పనిని, మీ న్యాయస్థానాలు చేసి వడ్డీ వ్యాపారులకు అప్పగిస్తున్నాయి.

ఈ విధంగా పేద వర్గాల ప్రజల్లో మిగిలి ఉన్న ఆ కాస్త కొనుగోలు శక్తిని కూడా వడ్డీ వ్యాపారులు లాగేసుకోవడం దీని రెండవ ఆర్థిక నష్టం. లక్షలాది ప్రజల నిరుద్యోగం, కోట్లాది  ప్రజల అల్పాదాయం, పరిశ్రమలు, వాణిజ్యం వికసించ కుండా అడ్డంకిగా నిలిచింది. ఆపై మీరు మంచి ఆదాయం ఉన్న వారిని ఖర్చు పెట్టవద్దని, ఎక్కువకు ఎక్కువ ఆదా చేయాలనే త్రోవ చూపిం తచారు. తద్వారా వ్యాపారానికి ఇంకో నష్టం వాటిల్లింది. ఇవన్నీ సరిపడవని మీరు ఇంకేం చేశారు?  లక్షలాది,  కోట్లాది మంది పేద ప్రజలకు చాలీచాలని జీతాలు, కూలీల రూపంలో లభించిన ఆ కాస్త కొనుగోలు శక్తిని కూడా వారు తమ జీవితావసర వస్తువులు కొనుగోలు చేయకుండా అందులోని ఓ పెద్ద భాగాన్ని వారి నుండి ఈ వడ్డీ వ్యాపారులు లాగేసుకుంటున్నారు. అయితే వారు ఈ ధనాన్ని కొనుగోలులో వినియోగించడానికి బదులు వడ్డీతో కూడిన ఋణాల రూపంలో తిరిగి సమాజం నెత్తిన రుద్దుతూ పోతున్నారు.  ఒక్కసారి మీరే లెక్కవేసి చూడండి. ఉదాహరణకు, వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాల్లో చిక్కుకున్న ఐదు కోట్ల ప్రజలున్నారనుకోండి. వారంతా ప్రతి నెల పది రూపాయల చొప్పున వడ్డీ వ్యాపారికి వడ్డీ రూపంలో చెల్లిస్తున్నారనుకోండి. ఈ విధంగా ప్రతి నెల 50 కోట్ల రూపాయల విలువ గల సరుకులు అమ్ముడుపోకుండా మిగిలిపోతు

న్నాయి. ఇంత గొప్ప ధనరాశి ఆర్థిక ఉత్పత్తి రంగం వైపు మరలడానికి బదులు ఇంకా వడ్డీతో కూడిన అప్పుల నిర్మాణంలో ప్రతి నెలా వినియోగించబడు తున్నది.[3]

## వాణిజ్య అప్పులు

ఇక వాణిజ్యం, పరిశ్రమలు, ఇంకితర వ్యాపార వ్యవహారాల కోసం తీసుకోబడే అప్పులపై వడ్డీ సమంజసమే అనే వాదన వల్ల సంభవించే ఆర్థిక నష్టాలు ఏమిటో పరిశీలిద్దాం.

పరిశ్రమలు, వాణిజ్యం, వ్యవసాయం ఇంకిలాంటివే అన్ని ఆర్థిక కార్యకలాపాల శ్రేయం కోరేదేమంటే ఈ కార్యకలాపాల్లో ఏ రకంగానయినా, ఏ పాత్రలోనయినా పాల్గొంటున్న వారందరి ప్రయోజనాలు, లక్ష్యాలు మరియు అభిలాషలు ఆ కార్యపు పురోగమనంతో ప్రగాఢమైన సంబంధం కలిగి ఉండాలి. దీని నష్టం అందరి నష్టంగా పరిగణింపబడాలి, అప్పుడే నష్టాన్ని దాని దరిదాపులకు రాకుండా అందరూ సమిష్టిగా, కలిసికట్టుగా పని చేస్తారు. అదే

---

3. *ఇక్కడో విషయం గమనార్హం. 1945లో – భారత విభజనకు పూర్వం – భారత దేశానికి సంబంధించి మన దేశంలోని వడ్డీ వ్యాపారుల అప్పుల విలువ 1,00,000,00,000 (వెయ్యి కోట్లు) రూపాయల వరకు ఉంటుందని అంచనా వేశారు. ఇది కేవలం ఒక్క భారత దేశానికి చెందిన పరిస్థితి. దీన్ని బట్టి ప్రపంచమంతటిలో ఇలాంటి అప్పుల సామూహిక విలువ ఎంత గొప్పగా ఉంటుందో అంచనా వేసుకోవచ్చు. ఇంకా ఏ వడ్డీ రేటైతే ఇలాంటి వ్యాపారాల్లో అమలులో ఉందో, దాని ప్రకారం నెలకు ఎంత వడ్డీ ఈ వడ్డీ వ్యాపారుల వద్దకు చేరుకుంటున్నదో ఊహించడం కష్టమేమీ కాదు.*

విధంగా దాని లాభం అందరి లాభంగా భావించబడినప్పుడే అందరూ సమిష్టిగా దాని పురోభివృద్ధి కోసం తమ శాయశక్తులా ప్రయత్నిస్తారు. ఈ విధమైన ఆర్థిక ప్రయోజనం దృష్ట్యా ఈ వ్యాపారంలో మానసిక లేక శారీరక కార్యకర్తలుగా కాకుండా, కేవలం పెట్టుబడిని సమకూర్చిన అయ్యవార్లుగా ఎవరైతే ఇందులో చేరారో, వారి చేరిక (కలయిక) కూడా ఇదే రకానికి చెందినదై ఉండాలి. అప్పుడే వారు దీని పురోభివృద్ధిలో చురుకుగా పాల్గొంటూ దాన్ని నష్టాన్నుండి కాపాడడంలో తమ శాయశక్తులా శ్రమించేవారు అవుతారు. కాని ఎప్పుడయితే చట్టం లేక శాసనం వడ్డీని చట్టపరంగా చేసిందో ధనవంతులయిన ప్రజలకు ఇంకో సులువైన మార్గం, దొడ్డి దారి లభించింది. వారు తమ పెట్టుబడికి భాగస్వాములుగా కాకుండా ఋణదాతల రూపంలో తమ ధనాన్ని అప్పుగా ఇచ్చి, దానిపై ఒక నిర్దిష్ట నిష్పత్తిలో తమ లాభాన్ని వసూలు చేసుకోవడానికి అవకాశం లభించింది. ఈ విధంగా సమాజానికి చెందిన ఈ ఆర్థిక ప్రక్రియలో ఒక అత్యంత విచిత్రమైన, అసహజమైన కర్త వచ్చి చేరుతాడు. ఈ ప్రక్రియలో పాలుపంచుకుంటున్న అందరు కార్యకర్తలకు భిన్నంగా దాని లాభ నష్టాలతో నిమిత్తం లేకుండా మహారాజులా దర్జాగా ఉంటాడు. ఈ కార్యక్రమం లేక వ్యాపారంలో నష్టం వస్తే అది అందరికీ ప్రమాదంగా పరిగణింపబడుతుంది. కాని ఇతనికి మాత్రం గ్యారంటీగా లాభం వచ్చితీరుతుంది. అందుకని ఎల్లరూ ఆ నష్టాన్ని ఆపడానికి శతవిధాలా ప్రయత్నిస్తున్నప్పటికీ, ఇతను మాత్రం మొత్తం వ్యాపారానికే నష్టం వచ్చి అది దివాలా తీసే సూచనలు కనబడనంత వరకు ఎలాంటి ఆందోళనకు గురికాడు. నష్టం వస్తున్నప్పుడు కూడా అతను వ్యాపారాన్ని కాపాడడానికి పరుగెత్తడు. దీనికి బదులు తన ఆర్థిక ప్రయోజనాల్ని కాపాడుకోవడానికి తాను పెట్టుబడి పెట్టిన ధనాన్ని కూడా లాగేసుకోవడానికే ప్రయత్నిస్తాడు. ఇదే విధంగా ఆర్థిక ఉత్పత్తి క్రియను పురోగమింపజేయడంలో కూడా అతనెట్టి చొరవ చూపడు, ఎందుకంటే అతని

లాభమైతే సునిశ్చితమై ఉంది. అందుకని ఈ వ్యాపార అభివృద్ధి, పురోగమనం కోసం అతనెందుకు శ్రమ తీసుకుంటాడు? మొత్తానికి సమాజ లాభనష్టాలతో సంబంధం లేకుండా విచిత్రమైన ఈ ఆర్థిక కార్యకర్త (పెట్టుబడిదారు) ఏకాంతంలో కూర్చుండి కేవలం తన పెట్టుబడిని "కిరాయి" (బాడుగ)పై నడిపిస్తూ ఉంటాడు. ఇంకా ఎలాంటి జంకూగొంకూ లేకుండా తన నిర్ణీత "బాడుగ"ను వసూలు చేసుకుంటూపోతాడు. ఈ చెడు పద్ధతి వల్ల పెట్టుబడి మరియు వ్యాపారం పరస్పర సంబంధాల్లో మిత్ర భావం, సానుభూతితో కూడిన సహకారానికి బదులు అత్యంత స్వార్థపరమైన సంబంధం ఏర్పడుతుంది. ప్రజల్లో ఎవరయితే ధనాన్ని కూడబెట్టి ఆర్థిక ఉత్పత్తి రంగాల్లో వినియోగించే అవకాశాలు కలిగి ఉన్నారో, వారు స్వయంగానూ వ్యాపారం చేయరు, లేదా వ్యాపారం చేసే వారితో పొత్తునూ పెట్టుకోరు. దానికి బదులు వారు కోరేదే మంటే వారి డబ్బు ఒక నిర్ణీత లాభపు గ్యారంటీతో అప్పుగా అందులో వినియోగింపబడాలి. ఇంకా ఆ నిర్ణీత లాభం కూడా సాధ్యమైనంత ఎక్కువ రేటుపై ఉండాలి. లెక్కలేనన్ని దాని నష్టాల్లో నుండి ప్రముఖంగా పేర్కొనదగినవి కొన్ని ఇలా ఉన్నాయి:

1. పెట్టుబడిలోని ఒక చెప్పుకోదగ్గ భాగం, కొన్ని సందర్భాల్లో అత్యధిక భాగం, కేవలం వడ్డీ రేటు పెరగడం కోసం వేచి చూస్తూ, ఏదో ఒక మంచి వ్యాపారంలో వినియోగింపబడకుండా నిరర్థకంగా పడి ఉంటుంది. తగిన స్కీంలు, ప్రాజెక్టులు, వ్యాపారాలు అందుబాటులో ఉంటాయి. ఉద్యోగం కోసం, పని కోసం ఎంతో మంది నిరుద్యోగులు తిరుగాడుతుంటారు. నిత్యావసర వస్తువుల డిమాండ్ కూడా మార్కెటులో అత్యధికంగానే ఉంటుంది. ఇవన్నీ ఉన్నప్పటికీ కూడా ఈ సాధనాలు ఉపయోగింపబడవు. నిరుద్యోగులకు పని దొరకదు. వాస్తవమైన డిమాండ్ ప్రకారం వస్తువులు అంగళ్ళలో వినియోగింపబడవు. ఇలా జరగడానికి కారణమేమిటి? పెట్టుబడిదారు ఏ వడ్డీ రేటుతో

లాభపడదల్చుకున్నాడో, ఆ రేటు అతనికి లభ్యమయ్యే అవకాశం కనిపించదు. అందుకని పనుల్లో, వ్యాపారాల్లో వినియోగించడానికి అతను డబ్బివ్వడు.

2. అత్యధిక వడ్డీ రేటు పొందాలనే పేరాశ ఎలాంటిదంటే దాని కోసం పెట్టుబడిదార్ల వర్గం వాణిజ్య వ్యాపారాల వైపు వాటి వాస్తవిక అవసరం, స్వాభావిక డిమాండ్‌ను అనుసరించి కాకుండా తమ స్వప్రయోజనాన్ని అనుసరించి ధనాన్ని ఆపుతూ, వదుల్తూ ఉంటుంది. దీన్ని ఒక దృష్టాంతం ద్వారా బాగా అర్థం చేసుకోవచ్చు. ఒక కాలువ యజమాని కాలువ నీటిని పంట పొలాల, తోటల అవసరాన్నిబట్టి వదలడమో లేక ఆపుకోవడమో చేయడు. దానికి భిన్నంగా నీటి అవసరం లేనపుడు నీటిని పుష్కలంగా, అత్యంత చౌకగా వదలడానికి సిద్ధమవుతాడు. ఇక ఎప్పుడయితే నీటి డిమాండ్ (అవసరం) పెరగడం మొదలవుతుందో, ఆ సమయంలో అతను తన ధరను కూడా పెంచడం మొదలెడుతాడు. చివరికది ఎంతగా పెంచుతాడంటే ఆ ధరకు నీటిని కొని సేద్యం చేయటం వల్ల రైతుకు ఎలాంటి లాభముండదు.

3. వడ్డీ మరియు దాని రేటు కారణంగానే వాణిజ్యం, పారిశ్రామిక వ్యవస్థ ఒక సక్రమమైన పద్ధతిలో నడవడానికి బదులు వాణిజ్య చక్రం (Trade Cycle) అనే రుగ్మతకు గురి అవుతుంది. దీని వల్ల అందులో పదే పదే వ్యాపార మాంద్యపు పరిస్థితులు ఏర్పడుతుంటాయి. దీన్ని మేము ఇంతకు ముందే వివరించి ఉన్నాం గనక తిరిగి దాన్నే పునరావృతం చేయనవసరం లేదు.

4. వడ్డీలో ఇంకొక 'మహత్య'ముంది. అదేమంటే సార్వజనీన దృష్టితో ప్రజాప్రయోజనాల వైపునకు ఇది ధనాన్ని మళ్ళించడానికి ఇష్టపడదు. ఎందుకంటే ప్రజోపయోగం రీత్యా అవి బాగుంటే ఉండొచ్చునేమోగాని ఆర్థికంగా అవి అంత లాభదాయకంగా ఉండవు. ఇంకా మార్కెట్‌లో ఏ రేటుతో వడ్డీ లభిస్తుందో అంత లాభం అందులో ఉండదు. అందుకనే అది దీనికి భిన్నంగా

అవసరం లేకపోయినప్పటికీ అధిక లాభాల్నిచ్చే కార్యక్రమాల వైపునకు పయనిస్తుంది. అటు వైపు వెళ్ళినా అక్కడ కూడా వడ్డీ రేటుకన్నా అధిక లాభాలు గడించటం కోసం మంచీ - చెడు, అర్హత-అనర్హత అన్ని పద్ధతులు అవలంబించడానికి అది ప్రజల్ని (అప్పు తీసుకున్న వారిని) వివశుల్ని చేసేస్తుంది. దీని నష్టాల వివరాలు కూడా లోగడ మేము వివరించి ఉన్నాం.

5. పెట్టుబడిదార్లు దీర్ఘకాలిక రుణాలివ్వడానికి వెనకాడుతారు. దీనికి కారణం ఏమిటంటే, సట్టా కార్యకలాపాల కోసం తమ వద్ద తగినంత ధన ముండాలని ఒకవైపు కోరిక ఉంటే, వేరొక వైపు భవిష్యత్తులో ఎప్పుడైనా వడ్డీ రేటు పెరిగిపోతే తక్కువ వడ్డీరేటుకు ఇచ్చిన తమ ధనం ఇరుక్కుపోయి నష్టంలో పడిపోతామేమో అనే దిగులు కూడా వారికి ఉంటుంది. దీని పర్యవసానం ఎలా ఉంటుందంటే పారిశ్రామికులు, కర్మాగార యజమానులు కూడా తమ వ్యాపారాల్లో సంకుచితత్వాన్ని, పిరికితనాన్ని ప్రదర్శించటం వినా మార్గాంతరం ఉండదు. ఇంకా శాశ్వత ఉన్నత ప్రమాణానికి బదులు తాత్కాలికంగా పని నడిపించే, వెళ్ళదీసే పద్ధతులతోనే సరిపెట్టుకుంటారు. ఉదాహరణకు, ఇలాంటి స్వల్ప కాలిక అప్పులతో కొత్త కొత్త ఖరీదైన యంత్రాల్ని, పరికరాల్ని కొనడం వారికి అసంభవమైపోతుంది. అందుకని వారు పాత యంత్రాల్నే మరమ్మతులు చేసు కుంటూ ఏదో విధంగా తక్కువ మన్నిక గల సరుకుల్ని తయారు చేసి, అంగళ్ళలో పడేసి, ఏ విధంగానైనా సరే, అప్పుతో పాటు వడ్డీ ఇంకా ఎంతో కొంత తమ లాభాన్ని సంపాదించుకోవాలని ఆరాటపడతారు. ఇంకా ఈ స్వల్పకాలిక ఋణాల మహత్యం కారణంగానే మార్కెట్‌లో సరుకుల డిమాండ్ తగ్గిపోతున్నదని తెలిసిన వెంటనే ఫ్యాక్టరీ యజమానులు ఉత్పత్తిని తగ్గిం చేస్తారు. కొద్దిపాటి సమయం కోసం కూడా సరుకుల ఉత్పత్తిని యథాతథంగా ఉంచడానికి అస్సలు సాహసించలేరు. ఎందుకంటే మార్కెట్‌లో సరుకు విలువే గనక పడిపోతే తాము దివాలా తీస్తామనే భయం వారిని

వెంటాడుతూ ఉంటుంది.

6. పెద్ద పెద్ద పారిశ్రామిక మరియు వ్యాపార పథకాల కోసం దీర్ఘకాలిక అప్పులేవైతే సమకూర్చబడతాయో, వాటిపై కూడా ఒక ప్రత్యేక రేటుతో వడ్డీ విధించబడడం ఎన్నో అనర్థాలకు కారణభూతమవుతుంది. ఇలాంటి అప్పులు సాధారణంగా పది, ఇరవై లేక ముప్ఫై సంవత్సరాల కోసం తీసుకోబడతాయి, ఇంకా ఈ పూర్తి కాలం కోసం ప్రారంభంలోనే ఒక నిర్ణీత శాతంతో సంవత్సరానికి ఇంతని వడ్డీ రేటు నిర్ణయించబడుతుంది. రాబోయే పది, ఇరవై లేక ముప్ఫయి సంవత్సరాల మధ్యలో ధరల ఎగుళ్ళు దిగుళ్ళు ఏ రూపాన్ని సంతరించుకుంటాయో, అప్పు తీసుకుంటున్న వారి లాభపు అవకాశాలు ఏ మేరకు పెరుగుతాయో, తరుగుతాయో లేక అసలే లాభముండదో - ఈ విషయాలు వడ్డీ రేటు నిర్ణయించేటప్పుడు పరిగణనలోకి తీసుకోవడం జరగదు. ఇరుపక్షాలకు అదృశ్య, భవిష్యజ్ఞానం లేనందున వీటి గురించి ముందే తెలుసుకోవడం సంభవం కూడా కాదు. ఉదాహరణకు, 1949లో ఒక వ్యక్తి 20 సంవత్సరాల కోసం సాలుకు 7 శాతం వడ్డీ రేటు చొప్పున ఒక పెద్ద ఋణాన్ని తీసుకొని, తద్వారా ఒక భారీ ప్రాజెక్టును ప్రారంభించాడనుకోండి. ఇక 1949లో నిర్ణయించబడిన ఈ శాతం వడ్డీ రేటుతో 1969 వరకు ప్రతి సంవత్సరం అసలు కిస్తుతో పాటు వడ్డీ కూడా కడుతూపోవడానికి అతను వివశుడై ఉంటాడు. కాని ఒకవేళ 1955కు చేరే వరకు ధరలు పడిపోయి ఆనాటి విలువకు సగమై పోయి ఉంటే దాని అర్థం. అతను ఒప్పందపు ప్రారంభ కాలంలో అమ్మిన సరుకులకు రెట్టింపు పరిమాణంలో సరుకులు అమ్మకపోతే అతను వడ్డీని చెల్లించలేడు. అసలు బాపతు కిస్తునూ చెల్లించలేడు. దీని పరిణామ స్వరూపంలో బయటపడే విషయం ఏమిటంటే, ఇలాంటి చౌక ధరల కాలంలో ఇలాంటి ఋణగ్రహీతల్లో అత్యధికులు దివాలా తీసేస్తారు.

లేదా దివాలా నుండి తప్పించుకోవడానికి ఆర్థిక వ్యవస్థకు తీవ్ర హాని కలిగించే నిషేధిత పన ఎల్లో నుండి ఏదో ఒకదానికి పాల్పడతారు. వివిధ కాలాల్లో పెరుగుతూ, తరుగుతూ పోయే ధరల మధ్య అప్పిచ్చే పెట్టుబడిదారుని లాభం అన్ని కాలాల్లోనూ సమానంగా ఉండాలని కోరడం న్యాయమూ కాదు, ఇంకా ఆర్థిక నియమాలననుసరించి ఇది సముచితమైనదని, సామూహిక స్థితి మంతానికి ఇది దోహదకారి కాగలదని నిరూపించనూ లేదు. ప్రపంచంలోని ఏ కంపెనీ అయినా నిత్యావసర వస్తువుల్లో నుండి ఏదో ఒక వస్తువును సరఫరా చేస్తానని గుత్తాపట్టి, రాబోయే ఇరవై లేక ముప్పై సంవత్సరాల వరకు ఆ వస్తువును ఇదే రేటుపై కొనుగోలుదారుకు సరఫరా చేస్తానని ఒప్పందం చేసుకుంటుందా? ఇలాంటిది ఎక్కడైనా విన్నారా? ఇలాంటిది ఓ దీర్ఘకాలపు వ్యాపారంలో సంభవం కానప్పుడు సంవత్సరాల తరబడిన కాలానికి తన అప్పు విలువను ముందే నిర్ణయించుకొని దాని ప్రకారమే వడ్డీ వసూలు చేసుకుంటూ పోవడానికి కేవలం ఈ పెట్టుబడిదారుకే ఏమన్నా కొమ్ములొచ్చాయా?

## ప్రభుత్వాలు తీసుకునే దేశీయ అప్పులు

ఇక రండి, ప్రభుత్వాలు వాటి అవసరాలు, లక్ష్యాల కోసం స్వయంగా తమ ప్రజల వద్ద నుండి సేకరించే అప్పుల విషయాన్ని పరిశీలిద్దాం. ఈ అప్పుల్లో లాభేతర (అంటే ఎలాంటి లాభంరాని) పనులలో వెచ్చించబడేది ఒకటి.

అగత్యపరులైన ప్రజల వ్యక్తిగత అప్పులపై విధించబడే వడ్డీ లాంటిదే ఈ మొదటి రకపు అప్పులపై విధించబడే వడ్డీ కూడాను. ఇంకా వాస్తవంగా చెప్పాలంటే ఇది అంతకన్నా ఘోరమైన విషయం. దీని అర్థం ఏమిటి? ఒక మనిషి, ఎవరికయితే ఈ సమాజం జన్మనిచ్చిందో, పెంచి పోషించిందో, ఇంకా

ఎంతో కొంత సంపాదించేటంతటి యోగ్యునిగా చేసిందో - ప్రమాదాల నుండి అతన్ని రక్షించి, నష్టాల నుండి అతన్ని కాపాడిందో, సమాజం యొక్క సాంఘిక, రాజకీయ మరియు ఆర్థిక వ్యవస్థలన్నీ కలిసి అతను ప్రశాంతంగా కూర్చుండి తన వ్యాపారాన్ని నడుపుకునే వ్యవస్థను ఏర్పాటు చేసిందో, ఆ సమాజానికి అతనేం ప్రతిఫలం ఇస్తున్నాడు? సమాజానికి కొన్ని అవసరాలు వచ్చి పడ్డాయి. (వాటితో ఆర్థిక లాభాలు పొందే ప్రశ్నే జనించదు). అవి గనక పూర్తవుతే సమాజంలోని ప్రజలందరితో పాటుగా స్వయంగా తానూ ప్రయోజనం పొందుతాడు. అయినా అతను వడ్డీ లేకుండా అప్పు ఇవ్వడానికి ఇష్టపడడం లేదు. "నా ఈ డబ్బుతో నీవు లాభపడినా, పడకపోయినా నాకు మాత్రం సాలుకు ఇంత శాతం వడ్డీ చొప్పున తప్పకుండా లాభం ఇవ్వాల్సిందే" అంటూ తన సమాజానికి, తన సంరక్షకురాలికి నిర్మొహమాటంగా సమాధాన మిస్తున్నాడు.

ఒక జాతికి యుద్ధంలాంటి సంక్లిష్ట పరిస్థితి ఎదురైనప్పుడు ఇలాంటి వ్యవహారం ఇంకనూ తీవ్రమైనదిగా భావించబడుతుంది. ప్రజలందరితో పాటుగా స్వయంగా ఈ పెట్టుబడిదారు ధన, మాన ప్రాణాలకు కూడా ముప్పు ఏర్పడింది. ఇలాంటి క్లిష్ట సమయంలో ప్రభుత్వ ఖజానా నుండి వెచ్చించబడు తున్న డబ్బంతా లాభదాయకమైన వ్యాపారాల్లో కాకుండా యుద్ధాగ్నిజ్వాలలకు సమర్పితమవుతున్నది. ఇందులో లాభపడే ప్రశ్నే జనించదు. ఈ ధనమంతా ఏ కార్యంలో వినియోగించబడుతున్నది? ఈ కార్యపు సాఫల్య వైఫల్యాలపై జాతి అంతటితోపాటుగా స్వయంగా ఈ పెట్టుబడిదారు జీవన్మరణాలు కూడా ఆధారపడి ఉన్నాయి. ఈ పనిలో జాతి ప్రజలంతా తమ సమయాన్ని, శ్రమను, ప్రాణాన్ని, సర్వస్వాన్ని ధారబోస్తున్నారు. వీరిలో ఏ ఒక్కరైనా జాతిని కాపాడు కోవటానికి తాము సమర్పించుకునే దానికి సాలుకు ఇంత లాభం రావాల్సిం

దేనని ప్రశ్నిస్తున్నారా? లేదు కదా! కాని జాతి అంతటిలో కేవలం ఈ ఒక్కపెట్టు బడిదారుడే తన ధనాన్ని సమర్పిస్తున్నప్పుడు సాలీనా ఇంత శాతం లాభం తనకు వచ్చి తీరాలనే షరతు విధిస్తున్నాడు. ఇంకా జాతి అంతా కలిసి, తన అసలును తనకు ముట్టజెప్పనంత వరకు తన ఈ లాభం తనకు క్రమం తప్పకుండా చేరుతూ ఉండాల్సిందే అని కోరుకుంటాడు - దీని కోసం ఒక శతాబ్దం గడిచినా సరే. దేశం, జాతి రక్షణ కోసం స్వయంగా అతని (పెట్టుబడి దారుని) రక్షణ కోసం ఈ యుద్ధంలో పాల్గొని కాళ్ళు, చేతులు పోగొట్టుకున్న వారు, తమ కొడుకుల్ని, తండ్రుల్ని, సోదరుల్ని, భర్తల్ని పోగొట్టుకున్న వారి జేబుల్నుండి సయితం తన ఈ లాభం తనకు వస్తూనే ఉండాలని అతను ఆకాంక్షిస్తాడు.[4] ఇక్కడొక ప్రశ్న. ఒక సమాజంలో వడ్డీని తినిపిస్తూ, తినిపిస్తూ ఇలాంటి ఒక వర్గాన్ని పోషించడం సమంజసమా? లేక కుక్కల్ని చంపే మందులు వీరికి తినిపించడం సముచితమా?

ఇక రెండవ రకానికి చెందిన అప్పులు. సామాన్య ప్రజలు మరియు సంస్థలు వ్యాపార లక్ష్యాల కోసం తీసుకునే అప్పుల కన్నా ఈ అప్పుల పరిస్థితి

---

4. ఈ సందర్భంగా ఒక విచిత్ర విషయాన్ని తెలుపడం అవసరమను కుంటున్నాము. నూట ఇరవై ఐదు సంవత్సరాలకు పూర్వం నెపోలియన్ తో పోరాడడానికి తమ పూర్వీకులు, వారి పెట్టుబడిదార్ల నుండి ఏ అప్పులయితే తీసుకున్నారో, ఆ యుద్ధపు అప్పుల వడ్డీని ఇంగ్లాండ్ ప్రజలు నేటికీ చెల్లిస్తూ వస్తున్నారు. ఇక 1861-65 మధ్యలో జరిగిన అమెరికన్ సివిల్ వార్ (అంతర్యుద్ధం) ఖర్చుల కోసం తీసుకోబడిన అప్పులకై అమెరికన్ ప్రజలు దీనికి (అంటే బ్రిటన్ ప్రజలు చెల్లించిన దానికి) నాలుగింతల డబ్బును ఇప్పటికే చెల్లించారు. అసలు వడ్డీతో సహా కలిపి దాదాపు వంద కోట్ల డాలర్లు ఇంకా చెల్లించాల్సి ఉంది.

భిన్నమేం కాదు. పైన మేము వ్యాపార అప్పుల వడ్డీపై లేవదీసిన అభ్యంతరాలన్నీ వీటికి కూడా వర్తిస్తాయి. లాభదాయకమైన పనుల్లో వినియోగించడానికి సాధారణంగా ప్రభుత్వాలు దీర్ఘకాలిక అప్పులు తీసుకుంటుంటాయి. కాని ఒక నిర్దిష్ట, నిర్ణీత వడ్డీ రేటుపై అప్పులు తీసుకుంటున్నప్పుడు రాబోయే ఇరవై లేక ముప్ఫై సంవత్సరాల కాలంలో దేశ అంతరంగిక పరిస్థితుల్లో, ప్రపంచ అంతర్జాతీయ పరిస్థితుల్లో ఏ మార్పులు జరుగనున్నాయో ఏ ప్రభుత్వమూ అంచనా వేయ జాలదు. ఇంకా ఏ పనుల కోసం వడ్డీతో కూడిన ఈ అప్పులు తీసుకోబడుతున్నాయో ఆ పనులు లాభదాయకంగా ఉంటాయో లేదో కూడా ఎవరూ చెప్పజాలరు. కొన్ని సందర్భాల్లో ప్రభుత్వ అంచనాలు తారుమారవుతాయి. ఆ పనులు, చెల్లిస్తున్న వడ్డీరేటు కన్నా అధికంగా లాభాలివ్వడం అటుంచి, దానికి సరిపడ లాభాలు కూడా ఇవ్వజాలవు. ప్రభుత్వాలు ఆర్థిక ఇబ్బందుల్లో పడిపోవడానికి ప్రధాన కారణాల్లో ఇదొకటి. వాటికి పాత అప్పులు, వాటి వడ్డీలు తీర్చడమే గగనమైనప్పుడు, లాభదాయకమైన కొత్త స్కీంలపై కొత్త పెట్టుబడులు సమకూర్చుకోవడం ఎలా సాధ్యమవుతుంది?

అంతేకాకుండా లోగడ మేము ఎన్నో చోట్ల పేర్కొన్నట్లు మార్కెట్‌లోని వడ్డీ రేటు కారణంగా, అంతకన్నా తక్కువ లాభాన్నిచ్చే ఏ పనైనా సరే, దానిపై పెట్టుబడి పెట్టడానికి అవకాశమే ఉండదు, ఆ పని ప్రజల కోసం ఎంత అవసరమైనది, అనివార్యమైనదైనా సరే. నిర్జన ప్రదేశాల్ని నివాసయోగ్యం చేయడం, బంజరు భూముల్ని సాగుబడికి అనుకూలంగా మార్చడం, అనావృష్టి ప్రాంతాల్లో నీటి కాలువల సౌకర్యం, పల్లె ప్రాంతాలకు రోడ్లు, విద్యుత్తు, ఆరోగ్య పరిరక్షణా కార్యక్రమాలు, తక్కువ ఆదాయం గల ఉద్యోగులకు పక్కా ఇళ్ళ నిర్మాణం – ఇలాంటివి ఎన్నో కార్యక్రమాలు, స్వయంగా అవి ఎంత ప్రయోజనకరమైనవైనా సరే, అవి లేకుంటే దేశం, జాతి ఎంత నష్టాన్ని ఎదుర్కోవాల్సి వచ్చినా సరే, అమలులో ఉన్న వడ్డీ రేటు కన్నా అధికంగా కాకపోయినా,

కనీసం సమానంగానైనా లాభం రానంత వరకు ఏ ప్రభుత్వం కూడా ఇలాంటి ప్రణాళికలపై డబ్బును వెచ్చించడానికి సాహసించజాలదు.

ఇక ఇలాంటి ప్రణాళికలపై వడ్డీతో కూడిన అప్పులు తీసుకొని ఖర్చు చేసినా కూడా, దాని వాస్తవ పరిస్థితి ఏమిటంటే, ప్రభుత్వం ఈ వడ్డీ భారాన్ని సామాన్య ప్రజలపై వడ్డిస్తుంది. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రతి వ్యక్తి జేబు నుండి టాక్సుల రూపంలో ఈ వడ్డీని వసూలు చేస్తూ పోతుంది. ఏళ్ళ తరబడి లక్షలకు లక్షల రూపాయలు వసూలు చేసి ఓ సుదీర్ఘకాలం వరకు ఈ పెట్టుబడి దార్లకు చెల్లిస్తూ పోతుంది. దీన్నో ఉదాహరణ ద్వారా తెలుసుకుందాం. ఉదాహరణకు, నేడు ఐదు కోట్ల రూపాయల పెట్టుబడితో ఒక నీటి పారుదల పథకాన్ని మొదలెట్టారనుకోండి. ఈ పెట్టుబడి సాలుకు 6 శాతం వడ్డీ రేటుతో తీసుకోవడం జరుగుతుంది. ఈ లెక్కన ప్రభుత్వం ప్రతి యేటా 30 లక్షల రూపాయలు వడ్డీ రూపంలో చెల్లించాల్సి ఉంటుంది. దీనికోసం ప్రభుత్వం భూమిలో నుండి ఏదో ఖజానాను (నిధిని) త్రవ్వి వడ్డీ చెల్లించదుగా! దాని కోసం అది నీటిని వాడుతున్న రైతులపై ఈ వడ్డీ భారాన్ని వేస్తుంది. ప్రతి రైతు చెల్లిస్తున్న నీటి తీరువాలో ఒక భాగం వడ్డీ చెల్లింపు కోసం ప్రత్యేకమైపోతుంది. ఇక రైతులు కూడా ఈ వడ్డీని తమ జేబు నుండి చెల్లించరు. వారు కూడా ఈ భారాన్ని ధాన్యపు ధరలో కలిపేస్తారు. ఈ విధంగా ఈ వడ్డీ పరోక్షంగా ధాన్యాన్ని ఉపయోగించే ప్రతి సామాన్య వ్యక్తిపై వచ్చి పడుతుంది. ఒక్కొక్క పేదవాడు, ఒక్కొక్క ఆకలిగొన్నవాడు తాను తినే ఒక్కొక్క ముద్ద అన్నంలో నుండి ఈ స్కీం కోసం సాలుకు 30 లక్షల వడ్డీ రేటుపై పెట్టుబడిని సమకూర్చిన పెట్టుబడి దారుకు నైవేద్యంగా పెట్టడం జరుగుతుంది. ప్రభుత్వానికి ఈ అప్పును తీర్చ డానికి 50 ఏళ్ళు పట్టినా సరే అది పేదల కడుపులు కొట్టి వసూలు చేస్తూ అర్థ శతాబ్దం వరకైనా సరే, ఈ ధనిక పెట్టుబడిదారులకు వడ్డీని చెల్లించే విధిని

సలక్షణంగా నెరవేరుస్తూ పోతోంది. ఇక ఈ తతంగమంతా చూస్తుంటే ప్రభుత్వ పరిస్థితి అప్పులిచ్చే షావుకారి వద్ద పని చేసే "గుమాస్తా" కన్నా భిన్నమైందేమీ కాదు.

ఈ ప్రక్రియ సామూహిక ఆర్థిక వ్యవస్థలో కడు విచిత్రమైనది. అది ధనాన్ని పేదల నుండి ధనికుల వైపునకు ఎప్పుడూ ఎడతెగక పారేయేరులా ప్రవహింపజేస్తుంది. నిజానికి సమాజ సాఫల్యం దృష్టితో చూస్తే ధనం, ధనికుల నుండి పేదల వైపునకు పారాలి. ప్రభుత్వాలు లాభదాయకమైన ప్రణాళికలపై వెచ్చించడానికి తీసుకునే అప్పుల్లోని వడ్డీలో మాత్రమే ఈ చెడు లేదు. వ్యాపార వాణిజ్యాల్లో నడుస్తున్న అన్ని వడ్డీల్లో ఈ చెడు ఉంది. ఏ ఒక్క వ్యాపారస్తుడు గాని, చేతి పనివాళ్ళు కానివ్వండి, కర్షకుడు కానివ్వండి, ఎవ్వరైనా సరే పెట్టుబడిదారులకు చెల్లించాల్సిన వడ్డీని తమ జేబు నుండైతే ఇవ్వరు. దానికి బదులు ఈ భారాన్ని వారంతా తమ తమ సరుకులపై వేస్తారు. ఈ విధంగా సామాన్య ప్రజల నుండి ఒక్కొక్క పైసా జమ చేసి లక్షాధికారుల, కోటీశ్వరుల జోలెల్లో పడేస్తుంటారు. ఈ ముదనష్టపు వ్యవస్థలో దేశంలోకెల్లా అత్యంత ధనికుడైన వడ్డీ వ్యాపారే అందరికన్నా ఎక్కువ "సహాయానికి" అర్హుడు. దినమంతా కష్టపడి, రక్తాన్ని చెమటగా మార్చి తన భార్యా బిడ్డల కోసం పిడికెడు కూలీ సంపాదించే సామాన్య దేశ పౌరునిపైనే అతనికి విధిగా సహాయపడే 'బాధ్యత' అత్యధికంగా ఉంటుంది. తన దేశంలోని 'అత్యంత దయనీయమైన' ఈ 'కోటీశ్వరుని' హక్కు తీర్చనంత వరకు ఆకలితో అలమటిస్తున్న అతని భార్యా పిల్లల నోట్లోకి ముద్ద పోవడం సంభవం కాదు.

## ప్రభుత్వాలు తెచ్చే విదేశీ ఋణాలు

ప్రభుత్వాలు విదేశీ పెట్టుబడిదార్ల నుండి తీసుకొచ్చే ఋణాలు దీనికి సంబంధించిన చివరి అంశం. ఇలాంటి అప్పులు సాధారణంగా అత్యధిక

మోతాదులో ఉంటా్యి. కొన్ని సందర్భాల్లో అవి వందల, వేల కోట్ల వరకు చేరుకుంటాయి. ప్రభుత్వాలు సామాన్యంగా ఇలాంటి అప్పులు దేశం విపత్కర పరిస్థితుల్ని ఎదుర్కొంటున్నప్పుడు, తీవ్ర సంక్షోభంలో ఉన్నప్పుడు, స్వయంగా దేశీయ వనరులు ఇలాంటి పరిస్థితుల్ని తట్టుకోలేనప్పుడు తీసుకుంటాయి. ఒక్కొక్కప్పుడు అవి పెద్ద మొత్తంలో అప్పులు తీసుకొచ్చి నిర్మాణాత్మక పనుల్లో వినియోగిస్తే వాటి రాబడి వనరులు తొందరగా అభివృద్ధి చెందుతాయనే ఆశతో కూడా ఇలాంటి అప్పులు తీసుకుంటాయి. ఇలాంటి అప్పుల వడ్డీ రేట్లు సాధారణంగా 6-7 శాతం నుండి 9-10 శాతం వరకు ఉంటాయి. ఈ వడ్డీ రేట్ల ప్రకారం వేల కోట్లపై వందల కోట్లలో కేవలం వడ్డీయే చెల్లించాల్సి ఉంటుంది. అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలోని ధనికులు, షావుకార్లు తమ ప్రభుత్వాల్ని మధ్యవర్తిగా ఉంచి ఈ ధనాన్ని అప్పుగా ఇస్తారు. ఇంకా ఈ అప్పుల జమానతు కోసం అప్పు తీసుకుంటున్న ప్రభుత్వ సుంకాల్లో నుండి ఏదో ఒక వస్తువు ఉదాహరణకు టూల్‌టాక్స్, పొగాకు, శర్కర, ఉప్పు మొదలుగాగల వాటి నుండి ఏదో ఒకదాని రాబడిని తమ వద్ద తాకట్టు పెట్టుకుంటారు.

మేమింతకు ముందే పేర్కొంటూ వచ్చిన సర్వరోగాలు ఇలాంటి అప్పుల్లో కూడా ఉంటాయి. వ్యక్తిగత అవసరాల కోసం తీసుకోబడే అప్పులు, వ్యాపార సంబంధమైన అప్పులు, ప్రభుత్వాలు తమ ప్రజల నుండి తీసుకునే ఆంతరంగిక అప్పులు - వీటన్నిటిలో ఏ చెడులైతే ఉన్నాయో, ఈ అంతర్జాతీయ అప్పులపై వడ్డీ చెల్లించే కారణంగా ఆ చెడులన్నీ వీటిలో కూడా ఉంటాయి. కాబట్టి ఆ చెడుగుల్ని, ఆ నష్టాల్ని తిరిగి వివరించవలసిన అవసరం లేదనుకుంటాము. అయితే అప్పులకు చెందిన ఈ రకంలో పై చెడులు, నష్టాలతోపాటే ఇంకో చెడు అదనంగా ఉంటుంది. అది పైన వివరించిన అన్ని చెడులకన్నా మహా భయంకరమైనది. అదేమిటంటే, ఇలాంటి అప్పుల ద్వారా జాతుల ఆర్థిక

పరిస్థితి చెడిపోయి అధ్వాన్నంగా మారిపోతుంది. దీని ప్రభావం మొత్తం ప్రపంచ ఆర్థిక వ్యవస్థపై పడుతుంది. దీని కారణంగా వివిధ జాతుల మధ్య వ్యతిరేకత, శత్రుత్వపు బీజాలు నాటుకుంటాయి. చివరికి ఈ కారణంగానే దౌర్జన్యానికి గురి అయిన జాతుల నవతరం మనస్సులు విరిగి తీవ్రవాదపు రాజకీయ, సాంఘిక మరియు ఆర్థిక తత్వాల్ని స్వీకరించడం మొదలెడతారు. ఇంకా తమ జాతి కష్టాల పరిష్కారాన్ని ఒక రక్తపాతంతో కూడిన విప్లవంలోనో లేక వినాశకరమైన యుద్ధంలోనో వెదకడం ప్రారంభిస్తారు.

ఏ జాతి ఆర్థిక వనరులు ముందే తమ కష్టాల్ని లేక తమ అవసరాల్ని పూర్తి చేయడానికి సరిపడలేదో, ఆ జాతి ప్రతి సంవత్సరం యాభై అరవై లక్షలు లేక కోటి రెండు కోట్ల రూపాయలు కేవలం వడ్డీ క్రింద, ఇంకా అసలు అప్పు కిస్తు క్రిందనూ ఎలా తీర్చగలుగుతుంది? ముఖ్యంగా దాని రాబడి వనరుల నుండి ఒక పెద్ద వనరును లేక అత్యంత లాభదాయకమైన సాధనాన్ని మీరు ముందే తాకట్టుపెట్టుకున్న నేపథ్యంలో అది కప్పుకునే గొంగళి ఇంకా కురచై పోతుంది. ఈ కారణంగానే ఏ జాతి అయితే ఓ పెద్ద ధనరాశిని ఈ విధంగా వడ్డీతో కూడిన అప్పుగా తీసుకుంటుందో, ఆ జాతి ఏ కష్టాల నుండి బయపడ డానికి ఈ అప్పు తీసుకున్నదో, ఆ కష్టాల నుండి బహు తక్కువగా బయటపడ గలుగుతుంది. అంటే ఇలాంటి అప్పులతో దాని కష్టాలు దూరం కావు సరికదా, అప్పులు దాని కష్టాల్ని ఇంకా పెంచేస్తాయి. అసలు అప్పు కిస్తు మరియు వడ్డీ తీర్చడం కోసం అది తన ప్రజలపై అత్యధిక టాక్సును విధించవలసి వస్తుంది. ఇంకా ఖర్చుల్లో బాగా తగ్గింపు చేసుకోవాల్సివస్తుంది. దీనివల్ల ప్రజల్లో అసంతృప్తి మొదలవుతుంది. ఎందుకంటే వారెంతగా ఖర్చుపెడుతున్నారో, వారెంతగా టాక్సు చెల్లిస్తున్నారో, దానికి సరిపడా లేక దానికి తగిన సౌకర్యం వారికి లభించదు. ఇంకొక వైపు దేశ ప్రజలపై ఇంత పెద్ద ఎత్తున టాక్సుల

బరువు మోపినప్పటికీ సంబంధిత ప్రభుత్వానికి అసలు అప్పు కిస్తులతోపాటు వడ్డీని కూడా క్రమం తప్పకుండా చెల్లిస్తూ ఉండడం కష్టతరమై పోతుంది. అప్పు తీసుకున్న దేశం తరపున చెల్లింపులో కాస్త జాప్యం లేక అలసత్వం కనబడగానే విదేశీ రుణదాతలు దానిపై నిందలు వేయడం ప్రారంభిస్తారు. ఇది నిజాయితీ లేని దేశం అని, తమ అప్పును ఎగ్గొట్టే యత్నంలో ఉందని ప్రచారం చేయ నారంభిస్తారు. వీరి సైగనందుకున్న వారి దేశ పత్రికలు, ఋణగ్రహీత దేశంపై విమర్శనాస్త్రాలు సంధించడం ప్రారంభిస్తాయి. ఆ తరువాత వారి ప్రభుత్వాలు ఈ వ్యవహారంలో జోక్యం చేసుకుంటాయి. తమ దేశపు పెట్టుబడిదార్ల పక్షం నుండి ఋణగ్రహీత దేశంపై రాజకీయ ఒత్తిడి తేవడమేగాక, ఆ దేశం ఎదుర్కొంటున్న సమస్యల్ని అక్రమంగా సొమ్ము చేసుకోవడానికి కూడా ప్రయత్నిస్తాయి. ఈ పరిస్థితికి కలవరపడిన ఆ దేశ ప్రభుత్వం తన ప్రజలపై మోయలేని టాక్సుల భారం మోపడమే కాకుండా ఖర్చుల్ని, కేటాయింపుల్ని ఇంకా బాగా తగ్గిస్తుంది. ఈ విధంగానైనా పై విషమ పరిస్థితి నుండి బయటపడాలని ప్రయత్నిస్తుంది. కాని దీని నకారాత్మక ప్రభావం ప్రజలపై పడుతుంది. నిరంతరంగా, రోజురోజుకూ పెరుగుతున్న ఆర్థిక భారం, సౌకర్యాల్లో క్షీణత కారణంగా ప్రజలు తీవ్ర చికాకుకు, అసహనానికి గురి అవుతారు. విదేశీ ఋణదాతల అనవసరపు ఎత్తిపొడుపులు, రాజకీయ ఒత్తిళ్ళతో వారింకా ఉద్రేకపూరితులవుతారు. తమ దేశంలోని మితవాద రాజకీయ నాయకులపై ఆగ్రహావేశాన్ని వెళ్ళగ్రక్కుతారు. ఇంకా వ్యవహార దక్షతగల నాయకులను కాదని వారు తీవ్రవాద ధోరణిగల నాయకు లను ఆశ్రయిస్తారు. ఇక ఇప్పుడు ఇలాంటి నాయకులేం చేస్తారు? తెచ్చిన అప్పులన్నిటికీ ఎగనామం పెడుతూ, మీ కొక్క పైసా ఇచ్చేది లేదు, దమ్ముంటే వసూలు చేసుకోండని రొమ్ము చరిచి సవాలు విసురుతారు.

ఈ స్థితికి వచ్చేసరికి వడ్డీ యొక్క కీడు, దాని కలహకారితనం పరా కాష్ఠకు చేరుకొంటుంది, సంబంధాలు చెడిపోతాయి. శత్రుత్వాలు పెరుగుతాయి. ఇంత జరిగినా కూడా వడ్డీ అనేది ఒక మహమ్మారి అని, అది పూర్తిగా నిషేధించదగినదని అంగీకరించని వివేకి ఎవడైనా ఉన్నాడంటారా? వడ్డీలోని ఇన్ని అనర్థాల్ని, వినాశనాల్ని, దుష్ఫలితాల్ని చూసిన తరువాత కూడా మహనీయ ముహమ్మద్ (స) సెలవిచ్చిన ఈ ఆదేశంలో ఎవరికైనా అనుమానముంటుందా?

“వడ్డీ ఎంత పెద్ద పాపమంటే, దాన్ని గనక డెబ్బై భాగాల్లో విభజిస్తే, అందులోని అతి చిన్న భాగపు పాపం, మనిషి తన కన్నతల్లితో వ్యభిచరించిన పాపంతో సమానం.” (ఇబ్నెమాజ, బైహఖీ)

